Photo by Anant Desai



బహుమతి
పొందిన వ్యాఖ్య

క్షణం తీరిక లేదు

పంపినవారి పేరు :
బి. వి. రావు - బంటుమిల్లి

# అదంతా దగ్గుతో ప్రారంభ మైనది...

మొదట తండ్రి దగ్గుతో యింటికి వచ్చాడు.... తరువాత తల్లికి అంటుకుంది. త్వరలోనే పిల్లలు గూడా దగ్గుట ప్రారంభించారు .... దగ్గు .... దగ్గు యీ విధంగా మీ కుటుంబములో సంభవించకుండా చూడండి. పెర్టుసిన్ టెష్నర్ అరవై సంవత్సరములపైనుంచి అన్ని విధములయిన దగ్గులకు, కోరింత దగ్గుతోసహా, త్వరితముగాను, క్షేమముగాను స్వస్థత చేకూర్చు నివారిణి అని రుజువైనది.




## కొనుడు పెర్టుసిన్ "టెష్నర్"

అందరు కెమిస్టుల వద్దను లభించును

ఇండియాలో తయారుచేయువారు

**ఇన్‌ఫా లిమిటెడ్,** పోస్టు బాక్సు నెం. 1041, బొంబాయి-1

దిగువ వారితో చేసుకున్న ఒడంబడిక ప్రకారము

ఎటెఫా లిమిటెడ్, షాన్ లీచ్‌టెన్‌స్టెయిన్

స్విస్ కస్టమ్ అండ్ ఎకనామిక్ టెర్రిటరీ

ILY-10-TEL

## ఈ సంచికలో కథలు

## వింతలు - విశేషాలు







ఇవిగాక రంగుల బొమ్మ కథ, ఫోటో శీర్షికల పోటీ, వార్తలు— విశేషాలు, మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు





# *See* INDIA *"Come to Life"* IN THREE DIMENSIONS WITH VIEW-MASTER® COLOR PICTURES

The Taj Mahal, Calcutta and other scenes become real as life when seen in true color and depth on View-Master's new India Reels. See for yourself! Other fascinating subjects now available on View-Master stereo Reels include France, Italy, Africa, Ireland, Australia, Vatican City, New Zealand, Egypt, England, Switzerland, Siam, Hong Hong, as well as American Scenic Attractions and Cities. Cowboy Stars, Tarzan, Wild Animal, Fairy Tale Reels for kids. Stereo pictures are mounted in seven-scene Reels for use in View-Master Stereoscopes and Projectors.



| | | | |
|---|---|---|---|
| వ్యూ మాస్టర్ .... | రు. 15/- | జూనియర్ ప్రొజెక్టర్ .... | రు. 92/8 |
| రీల్సు .... | రు. 2/4 | లైట్ (దీపం) ఎటాచ్‌మెంటు | రు. 15/- |

## పటేల్ ఇండియా లిమిటెడ్,

7/90, వాలాజా రోడ్ :: మద్రాసు.

ఇతర ఆఫీసులు: బొంబాయి * కలకత్తా * న్యూఢిల్లి

# చందమామ - ఇంగ్లీషు

ప్రారంభ సంచిక (జులై)
జూన్ 15-వ తేదీన వెలువడుతుంది.

విడి ప్రతి
0-6-0



సంవత్సర చందా
4-8-0

మీ కాపీకి మీ ఏజంటును అడగండి.
లేదా మాకు చందా పంపండి.

త్వరలో వెలువడుతుంది:

## జహ్నమాము (ఒరియా)

చందమామ పబ్లికేషన్స్
వడపళని :: మద్రాసు - 26.

# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

ఈ సంచికలోని 59 వ పుటలో ప్రకటింపబడిన పూర్తి పేజీ చిత్రం మిమ్మల్ని ఆకర్షించేవుంటుంది. ఇది జూలై నుండి వచ్చే కొత్త త్రివర్ణ సీరియల్ "మకరదేవత" కథకు సంబంధించింది. సుమారు రెండువేల సంవత్సరాలనాటి ఈ అద్భుతగాథలో వచ్చే ప్రముఖ వ్యక్తులూ జంతువులూ జలచరములూ కొంచెంగా ఈ పటంలో సూచింపబడినై. ఇందులోని ప్రాచీనకాలపు వాతావరణమూ, సంఘటనలూ, ఆచార వ్యవహారాలూ ఈనాడు మనకు వింతకొల్పుతై. లోగడ తెల్పినట్టు, అట్టచివరి బొమ్మకు ఒక చక్కటి చీనా కథ ఆరంభమవుతున్నది. అపూర్వమైన ఈ కథ ఎన్నెన్నో వింతలూ విశేషాలు కనబర్చి, మీకు ఆనందాశ్చర్యాలను కలిగించటమే గాక, అనేకమైన గుణపాఠాలనుకూడ నేర్పుతుంది.

జూన్ 1955

సంపుటి 16
సంచిక 6



# నీవానది కథ

నీవానది తీరమ్మున
నేరేడు చెట్టులోన
నివసించెడు పావురాలు
నేరవు ఏ పాపమ్ములు!

చెట్టుక్రింద పుట్టలోన
చెడ్డ త్రాచు పాముండెను
పిట్టల వేటాడుటలో
గట్టిది ఆ నాగుబాము!

ఒక్కనాడు మగ పిట్ట
చిక్కగానే దాని బట్టి





గ్రక్కున తినివేసె పాము
అక్కటక్కటా పాపము!

ఆడుపిట్ట అయ్యోమని
గోడుపెట్టుచున్న గాంచి
నీడనున్న కలువపువ్వు
వాడిపోయె వీడి నవ్వు.

పుట్టలోని నాగుపాము
గట్టిగ ఆలోచించెను
ఎట్టైనను ఆ పిట్టను
పొట్టను బెట్టగ నెంచెను.

రాత్రిపూట కాగానే
రయమున వెలువడగానే





## గేయ కథ

చందమామ పకపక యని
చిందించెను చిరునవ్వును!

త్రాచుపాము పడగనెత్తి
లేచి పావురమును చుట్టి
మాణిక్యము దివ్వెచుట్టి
మంగళహారతి నిచ్చెను!

కనుకనె మా నీవానది
కారుణ్యము లోపగునది
చిత్పుర పరిసర సీమల
చెంగలించు నీవానది!

పుట్ట కొసను బలుసుముండ్లు
గట్టిగ నాటెను కండ్లు!

విలవిలమని గిరగిరమని
గిలగిలాడు పామును గని
ముళ్లను ఆ పావురమ్మ
ముక్కున లాగెను పాపము!

ఈ చిత్రము చూచి చిలుక
వైచిత్రం బని పలుకగ,
కాదు కాదు కరుణత్వము
వాద నేల యనె కోకిల!

నీవానదిలోని చేప
నీటిమీద కన్పించెను



# అట్టమీది బొమ్మ

కృష్ణుడు సత్యభామాసమేతుడై వచ్చి పాండవులతో సంప్రతిస్తూవుండగా అక్కడికి చిరంజీవి ఐన మార్కండేయరుషి రాక అందరికీ మరింత సంతోషాన్ని కూర్చింది. ఆయనకు స్వాగతమిచ్చిన తరువాత శ్రీకృష్ణుడు, కొన్ని దివ్యగాథలు వినటానికి కుతూహలంగా వుందని అన్నాడు. ధర్మరాజు తనకు గల కొన్ని సంశయాలు తెల్పి, వాటిని పరిష్కరించుమని కోరాడు. అప్పుడు మార్కండేయుడు చెప్పిన కథలలో ఇది ఒకటి :—

పూర్వం, హైహయ రాజవంశానికి చెందిన యువకుడొకడు ఒకనాడు వేటకు వెళ్లాడు. ఒక జింకను బాణంతో కొట్టాడు. ఐతే—అది జింక కాదు, జింకచర్మం ధరించి తపస్సు చేసుకొంటున్న ఒక మునికుమారుడు! హైహయ రాకుమారుడు తనుచేసిన తప్పుకు చింతిస్తూ ఇంటికి పోయి, పెద్దలకు చెప్పాడు.

వారంతరూ దుఃఖిస్తూ, అడవిలో గాయపడివున్న మునికుమారునివద్దకు బయలైరారు. తోవలో వారికి తార్క్ష్యముని ఆశ్రమం కనిపించింది. తార్క్ష్యముని వారికి ఆతిథ్యమీయబోగా, వారు 'మహాత్మా !—మేమిట్టి సత్కారానికి అర్హులం కాము. అరణ్యంలో మా పిల్లవాడు ఒక మునికుమారుని చంపి, పాపం కట్టుకొన్నాడు. దానికి తగిన శిక్ష మేము అనుభవించితీరాలి. కనుక, మాదారిని మమ్మల్ని పోనీయండి' అని వినయంగా చెప్పుకొన్నారు.

అప్పుడు తార్క్ష్యముని చిరునవ్వు నవ్వుతూ, 'అలానా! మీరు ఇందుకు చింతించకండి. మంచివాళ్లు తెలియక చేసిన పాపానికి క్షమాపణ వున్నది. మీరు మంచివాళ్లు కనుకనే పశ్చాత్తాపం పొందుతున్నారు. ఏదీ, మీరు చంపామనుకున్నది ఇతడేనా, చూడండి!' అంటూ తన కుమారుని పిలిచాడు.

ఆశ్రమం లోపలినుండి బయటికి వచ్చిన మునికుమారుని చూచి, హైహయ రాకుమారుడు ఆశ్చర్యంతో 'ఇతడే, ఇతడినే నేను బాణంతో కొట్టింది!' అని చెబుతూ, గుర్తుపట్టాడు.

'బాణంతో కొట్టబడిన యితడు ఎలా బతికివచ్చాడు?' అని అందరూ ఆశ్చర్యంతో ప్రశ్నించగా, 'అదే తపఃప్రభావం...' అని తార్క్ష్యముని ధర్మబోధ చేశాడు. తరువాత ముని ఆతిథ్యాన్ని హైహయులందరూ తృప్తితోనూ, ఆనందంతోనూ స్వీకరించారు.



# దుష్టుడి సహాయం

ఒకప్పుడు వినయశీలుడనే రాజు విలాసపురాన్ని ఏలుతూ ఉండేవాడు. ఆయన భోగపరాయణుడు కావటంవల్ల వార్ధక్యం త్వరగానే పైనపడింది. నడివయసులోనే జుట్టు నెరిసి, ముఖమూ శరీరమూ ముడతలు పడిపోయి, కీళ్ళు సడలటం చూసి రాజుకు దుఃఖం కలిగింది.

రాజు ఒకనాడు తన వైద్యుణ్ణి, తరుణచంద్రుడనేవాణ్ణి, పిలిపించి, "ఏమోయ్, నన్ను ముసలితనంనుంచి బయటపడెయ్యటానికి చికిత్స ఏమైనా ఎరుగుదువా? నన్ను తిరిగి యౌవనవంతుణ్ణిచెయ్యి. నీవు కోరినదంతా ఇస్తాను," అన్నాడు.

తరుణచంద్రుడు కొంచెం ఆలోచించి, "మహారాజా, నాకు కాయకల్ప చికిత్స తెలుసును. తమరు ఆరుమాసాలు నా అధీనంలో ఉన్నట్టయితే తమకు సంపూర్ణ యౌవనం చేకూర్చగలను," అన్నాడు.

రాజు వెంటనే, తాను ఆరు నెలలపాటు రాజ్యాంగం వదిలి కాయకల్పసిద్ధి పొందబోతున్నానని దేశమంతటా చాటింపు వేయించాడు. తరుణచంద్రుడు ఊరిబయట ఒకచోట భూగర్భంలో చీకటికొట్టు కట్టించి అందులో రాజును ప్రవేశపెట్టి, ఏవేవో ఔషధాలివ్వ నారంభించాడు. ఆ కొట్టుకు ఎవరూ రావటానికి అనుమతి లేదు.

తరుణచంద్రుడి వైద్యంవల్ల రాజు ముసలితనం మరింత జాస్తి కావటమే గాక, ఏదో జబ్బుకూడా ప్రారంభమయింది. కొద్దిరోజులలో ఆయన ఆ చీకటికొట్టులోనే దిక్కుమాలిన చావు చచ్చాడు. ఆయన శవాన్ని ఆ కొట్టులోనే తరుణచంద్రుడు లోతుగా పాతేశాడు.

తరవాత అతను కొన్నిరోజులపాటు రహదార్లు కాచి, వినయశీలుడి పోలికలు కల ఒక యువకుణ్ణి పట్టుకున్నాడు.

టి. విశ్వేశ్వరరావు



"నేను చెప్పినట్టు వింటివా, నిన్ను రాజును చేసేస్తాను. నా మాట జవదాటి నట్టయితే నీ రహస్యం బయటపెట్టి నిన్ను కొరతవేయిస్తాను. ఇష్టమైతే నా వెంటరా!" అన్నాడు, తరుణచంద్రుడు.

ఆ యువకుడు తన ఆజ్ఞానుసారం నడుస్తానని మాట ఇచ్చినాక, తరుణ చంద్రుడు అతనితో వినయశీలుడి కాయ కల్ప చికిత్సగురించీ, చావుగురించీ చెప్పే శాడు. తరవాత అతన్ని తెచ్చి చీకటికొట్లో పెట్టేసి, మంత్రి మొదలైన రాజోద్యోగు లందరూ వచ్చి రాజుతో మాట్లాడవచ్చునని కబురుచేశాడు.

దివాణంలోని అధికారులందరూ వచ్చారు. ఒక్కొక్కరిని తరుణచంద్రుడు చీకటికొట్టులోకి తీసుకుపోయాడు. వారి కెవరికీ రాజు కనిపెంచలేదు. కాని వారు రాజ్యాంగ వ్యవహారాలన్నీ చెబుతూంటే, యువకుడు ఊకొట్టాడు. ఈవిధంగా అతనికి రాజ్యాంగ వ్యవహారాలన్నీ సమగ్రంగా తెలిసిపోయాయి.

ఈవిధంగా ఆరుమాసాలు గడవనిచ్చి తరుణచంద్రుడు యువకుణ్ణి చీకటికొట్టు నుంచి బయటికి రప్పించటానికి ఏర్పాట్లు చేశాడు. దైవజ్ఞులు నిర్ణయించిన ముహూ ర్తానికి నగరంలో జనమంతా ఊరిబయట చేరారు. రాజోద్యోగులంతా చేతులు కట్టు కుని చీకటికొట్టు ద్వారంవద్ద నిలబడ్డారు. కొత్త యువకుడు రాజు దుస్తులు ధరించి బయటికి వచ్చాడు.

రాజులో మార్పు చూసి అందరికీ అత్యా శ్చర్యమయింది. కొద్ది పోలికలున్నప్పటికీ ముసలిరాజు పూర్తిగా మారిపోయాడు.

"చాలా కష్టపడి కాయకల్పంద్వారా మహారాజుకు ఎన్నటికీ ముసలితనం లేకుండా చేసేశాను. అవసరమైనట్టయితే ఆయన స్వరూపంకూడా ఇట్టే మార్చెయ్య గలను," అన్నాడు తరుణచంద్రుడు.



స్వరూపం మార్చగలననటంలో గల బెదిరింపు యువకుడికి ఒక్కడికి మాత్రమే అర్థమయింది.

ప్రజలు రాజును మేళతాళాలతో ఊరేగించి దర్బారుకు తీసుకుపోయారు. అక్కడ అతనికి తిరిగి మహా వైభవంగా పట్టాభిషేకం జరిగింది. పునర్జన్మ యెత్తాడు గనకనూ, జరను—అంటే, ముసలితనాన్ని—జయించాడు గనకనూ ఆయనకు 'అజరు' డని పేరుపెట్టారు.

ఈ మార్పుతోబాటు దివాణంలో తరుణచంద్రుడి పలుకుబడికూడా హెచ్చింది. అతని నోటివెంట ఏ మాట వచ్చినా, మంత్రి దగ్గరనుంచీ ప్రతివారూ రాజాజ్ఞగా భావించి, శిరసావహించసాగారు. ఈ అలుసు చూసుకుని తరుణచంద్రుడు తన అధికారాన్ని విచ్చలవిడిగా దుర్వినియోగ పరచసాగాడు.

ఇక రాజుమీద తరుణచంద్రుడికి గల అధికారానికి హద్దే లేదు. అజరుడు ఇదంతా చాలాకాలం సహించి ఊరుకున్నాడు. చివరకు ఒకనాడు అతను తరుణచంద్రుణ్ణి ఒంటరిగా పిలిచి, "నీ ప్రవర్తన యేమీ బాగాలేదు. నన్ను నువు రాజును చేశావు కనక నామీద అధికారం చెయ్యి. మంత్రి చేసే పనులకు అడ్డు రాకు," అన్నాడు.

"రెండురోజులు సింహాసనం ఎక్కగానే కళ్ళు నెత్తికి వచ్చాయా? నాకు నువే లెక్కలేనప్పుడు నీ మంత్రులూ, మిగిలిన వాళ్ళూ ఎంత? నేను నీకు చేసిన ఉపకారం మరిచిపోతున్నావు!" అని యెత్తిపొడిచాడు తరుణచంద్రుడు.

"నువు దుర్మార్గుడివి. నీవంటివాడివల్ల సహాయం పొందటమే తప్పు. దానికి కృతజ్ఞత చూపటం మరింత తప్పు," అంటూ అజరుడు కత్తిదూసి ఆ క్షణంలోనే తరుణచంద్రుడిని చంపివేశాడు.

తరవాత అజరుడు ప్రజలను సుఖంగా పరిపాలిస్తూ, చాలాకాలం రాజ్యంచేశాడు.





# బతకలేక బడిపంతులు

ఒక ఊళ్ళో ఎందుకూ పనికిరానివాడొకడుండేవాడు. కాస్త చదువుకున్న కుటుంబంలో పుట్టటంచేత, మాటల సందర్భాన చదవటానికి నాలుగు పద్యాలూ, శ్లోకాలూ సామెతలూ పట్టుబడ్డాయేగాని వాడికి స్వతహాగా పొట్టపొడిచినా అక్షరంలేదు.

తండ్రి పోగానే తన కాళ్ళమీద తాను నిలబడవలిసి వచ్చేసరికి వాడికి ఏంచెయ్యాటానికీ పాలుపోలేదు. ఎందుకంటే వాడికే పనీ చేతకాదు. బతకలేకపోతే బడిపంతులన్న సామెతను జ్ఞాపకం తెచ్చుకుని వాడు బడిపంతులు పని చేదామనుకున్నాడు.

అందుకని వాడు మంచిరోజు చూసి పెద్ద తలపాగా చుట్టి, దూరగ్రామానికి వెళ్లి, ఒకరి అరుగుమీద బడి పెట్టాడు.

ఊళ్ళో వున్న పిల్లలు కొందరు బళ్ళో చదవటానికి వచ్చారు. పంతులు ఒక ఉపాయం ఆలోచించాడు. తన బళ్ళో చదువుకునే పిల్లల్లో కొందరికి కొద్దిగా చదువొచ్చు, మిగిలినవాళ్ళకు ఏమీ రాదు. కొంచెం చదివిన పిల్లలచేత ఏమీ రాని వాళ్ళకు చదువు చెప్పించసాగాడు.

పల్లెటూరి వీధిబడికి పిల్లల్ని పంపే తల్లి తండ్రులు తమ పిల్లలకు ఎంత చదువొచ్చిందని సామాన్యంగా చూడరు. పంతులు పిల్లల్ని భయభక్తులతో పట్టుకొస్తున్నాడా అని చూస్తారు. కొత్త పంతులు పిల్లలకు బాగా దేహశుద్ధి చేస్తూండేవాడు.

ఆ ఊళ్ళో కామమ్మ అని ఒక ఇల్లాలుండేది. ఆవిడ భర్త చాలాకాలం క్రితం కాశీయాత్రకు బయలుదేరాడు. వెళ్ళి సంవత్సరమయింది. అప్పటినుంచీ ఆయన జాడ లేదు. ఇంతలో ఒకనాడు ఆమెకు ఎక్కడినుండో జాబు వచ్చింది. అది తన భర్తే రాసి వుంటాడనుకుని కామమ్మ ఆ జాబు పట్టుకుని పంతులుగారిదగ్గిరికి వచ్చి,

డి. దశరథరామయ్య

"ఇది కాస్త చదివిపెట్టు, నాయనా! మా వారేమన్నా రాశారేమోనూ!" అన్నది.

పంతులు ఆ జాబు తీసుకుని ఎగాదిగా చూశాడు. ఒక్క అక్షరంకూడా రాని పంతులుకు చేతులు వణికి, నిలువుగుడ్లు పడ్డాయి.

పంతులు వాలకంచూడగానే కామమ్మకు గుండె చల్లబడింది.

"ఏం కొంపమునిగిందో త్వరగా చెప్పు, నాయనా!" అన్నది కామమ్మ, వొణుకుతున్న గొంతుతో.

"నాబొంద, నేనేం చెప్పేదీ?" అన్నాడు పంతులు, మరింత వణికే గొంతుతో.

"బొట్టు తుడిపేసుకోనా? పుస్తెలు తెంచేదీ?" అన్నది కామమ్మ ఏడుస్తూ.

"అహా!" అన్నాడు పంతులు తడబడుతూ హీనస్వరంతో.

కామమ్మ గుండెలు బాదుకుంటూ, భోరున ఏడుస్తూ ఇంటో వెళ్ళి పడింది. చుట్టుపక్కలవాళ్ళు పరామర్శించవచ్చారు.

"ఊరుకో! ఏంచేస్తాం? కాశీకి పోయినవారూ కాటికి పోయినవారూ తిరిగి రారని అనరూ? అంతే మరీ!" అన్నారు వాళ్ళు.

కామమ్మ మొగుడు పోయాడన్న వార్త ఊరంతా పాకింది.

"అసలు విషయం ఏమిటి? వార్త ఎవరు తెచ్చారు? ఎక్కడ పోయాడు? ఎప్పుడు పోయాడు?" అంటూ మగవాళ్లు ప్రశ్నలు వేశారు. కామమ్మ ఏడుస్తూ తనకు వచ్చిన జాబు వారికిచ్చింది.

"ఇదేమిటమ్మా? ఎందుకిలా ఏడుస్తున్నావు? ఈ జాబు రాసింది మీ ఆయనే! ఎల్లుండి వస్తున్నాడు? ఈ ఉత్తరం చదివిందెవరు?" అని అడిగారు మగవాళ్లు.

పంతులు చదివాడని కామమ్మ చెప్పింది. ఎవరూ నమ్మలేకపోయారు. పంతులును పిలుచుకురావటానికి కొందరు వెళ్లారు. కాని పంతులు అప్పుడే పొలిమేర దాటి వెళ్ళిపోయాడు!





# ఆడదాని సలహా

పర్షియాను ఒకప్పుడు పరిపాలించిన ఖుస్రోకు చేపలంటే చాలా యిష్టం. ఒక నాటి ఉదయం ఆయన, తన భార్య అయిన షిరీన్‌తో మిద్దెమీద కూచుని ఉండగా బెస్తవా డొకడు ఆయన కొక చేపను తెచ్చి కానుకగా ఇచ్చాడు. అది చాలా అపురూప మైనది. చాలా పెద్దదికూడా. రాజు దానిని చూసి ఎంతో సంతోషించి, బెస్తవాడికి బహుమానంగా నాలుగువేల కాసు లివ్వ వలసిందిగా ఉత్తరువుచేశాడు.

తన భర్త సంతోషం కలిగినప్పు డీ విధంగా ఒళ్ళు తెలియని బహుమానా లివ్వటం షిరీన్ చాలాసార్లు చూసింది. ఆమెకిది ఎంతమాత్రం ఇష్టంలేదు.

బెస్తవాడు అవతలికి వెళ్లగానే షిరీన్ తన భర్తను కోప్పడింది.

"ఒక్క చేపకు నాలుగువేల కాసులు బహుమానమా? ఇలా ఇవ్వటం మొదలు పెడితే రేపటినుంచీ ప్రతిదానికీ ఇదేప్రకారం ఇవ్వవలిసి వస్తుంది. ఏదో మిషపెట్టి వాడి కిచ్చిన డబ్బు తిరిగి తీసుకోండి."

"ఇచ్చిన డబ్బు తిరిగి తీసుకోవటం కంటె రాజరికానికి తలవంపు మరొకటి ఉంటుందా? ఏదో ఈసారి కిలా పోనిద్దూ," అన్నాడు ఖుస్రో.

"అలా ఎంతమాత్రం వీలులేదు. మన మర్యాదకు భంగం ఏమీ కలగకుండానే ఇచ్చినది పుచ్చుకోవచ్చు. నేను ఉపాయం చెబుతాను వినండి. బెస్తవాణ్ణి వెనక్కు పిలిపించి, ఈ చేప మగదా, ఆడదా అని అడగండి. అది మగదని వాడన్నట్టయెనా, మగది అక్కర్లేదు, ఆడచేప కావాలని ఈ చేపను వాడికి తిరిగి ఇచ్చెయ్యండి. అది ఆడదేనని వాడంటే, మగచేప కావాలని అనండి," అని షిరీన్ భర్తకు నమ్మకంగా సలహా ఇచ్చింది.

వి. పురుషోత్తం

ఖుస్రోకు తన రాణీపై చాలా మక్కువ. ఆమెకు అసంతృప్తి కలిగించటం ఆయన కేమాత్రమూ ఇష్టం లేదు. అందుచేత ఆయన, తన మనసు బాధపడుతున్నప్పటికీ బెస్తవాణ్ణి వెనక్కి పిలిపించాడు.

"ఏమోయ్, ఈ చేప ఆడదా, మగదా?" అని అడిగాడాయన.

బెస్తవాడు రాజుకు వంగి సలాముచేసి, "హుజూర్, ఈ జాతి చేపలలో ఆడా మగా లేదు. ప్రతి చేపా దేనికదే గుడ్లుపెట్టి పిల్లలు పొదుగుతుంది," అన్నాడు.

ఖుస్రో ఈ మాటలకు విరగబడి నవ్వుతూ, బెస్తవాడికి నాలుగువేల కాసులకు బదులు, ఎనిమిదివేల కాసులిమ్మని ఉత్తరువు చేశాడు. అంత డబ్బూ ఎంచి బెస్తవాడి బుట్టలో వేశారు. వాడు పరమానందంతో బుట్ట తీసుకుని బయలుదేరాడు.

వాడు రాజభవనం ముందు ఆవరణలో నుంచి పోతూండగా ఒక కాసు బుట్టలో నుంచి పడి, గచ్చుమీద దొర్లి ఎటో పోయింది. వెంటనే బెస్తవాడు బుట్టను కింద పెట్టి, చుట్టుపక్కల అంతా వెతికి, పడిపోయిన కాసు ఏరుకుని, సంతోషంతో బుట్టలో వేసుకున్నాడు.

ఇదంతా మిద్దెమీదినుంచి ఖుస్రో, అతని భార్యా చూస్తూనే వున్నారు.



"చూశారా, ఎంత నీచుడో! ఒక్క కాసు పడిపోతే, ఎవరికన్నా పేదవాడికి దొరుకుతుందిలెమ్మన్న ఔదార్యం కూడా లేకుండా, వాడు దానికోసం వేటాడి తీసుకున్నాడు!" అన్నది షిరీన్.

తన రాణీని తృప్తిపరిచేటందుకై ఖుస్రో బెస్తవాణ్ణి మళ్లీ వెనక్కు పిలిపించి వాడితో ఇలా అన్నాడు:

"ఓరీ పరమ నీచుడా! ఒక్క వెండి కాసు పడిపోతే, అది ఏ పేదవాడికైనా దొరుకుతుందిలెమ్మనుకోకుండా, బుట్టెడు కాసులు అవతల పెట్టి, దానికోసం అంత కష్టపడి వెతికావే, నీ అత్యాశనేమనాలి?"

బెస్తవాడు నేలదాకా వంగి సలాము చేసి, "అల్లా ఏలినవారిని కటాక్షించాలి! ఒక్క కాసు పోయినందువల్ల నాకు దారిద్ర్యం వస్తుందని నేనెన్నడూ అనుకోలేదు. నాదృష్టిలో అ కాసు పవిత్రమైనది. దాని మీద ఒక వైపున రాజుగారి ముద్రా, రెండో వైపున ఆయన పవిత్రనామమూ ఉన్నాయి. అది నేలమీద పడి వుంటే ఎవరైనా చూడక తొక్కుతారేమో అని భయపడ్డాను. హుజూర్ వారు మట్టిలోనుంచి కాసు విలవచెయ్యాని బెస్తవాణ్ణి ఏరగాలేందీ, నేను మట్టిలోనుంచి ఒక కాసు ఏరటంలో వింత ఏమిటి?" అన్నాడు వినయంగా.

వాడి తెలివితేటలకు ఖుస్రో పరమానందభరితుడై వాడికి మరి నాలుగువేల కాసులు అదనంగా ఇప్పించి పంపేశాడు.

ఈ వింత సంఘటనతో ఖుస్రోకు ఆడవాళ్ల సలహాలను పాటించటంలో వున్న ప్రమాదం అర్థమయింది. అందుకని ఆరోజే ఆయన నగరమంతటా ఈవిధంగా చాటింపు వేయించాడు:

"ఆడవాని సలహాప్రకారం ఎవరూ నడుచుకోవద్దు. వారి సలహా విన్నట్టయితే సగం పొరపాటును దిదుకోవటానికి రెండు పొరపాట్లు అదనంగా చేయవలిసివస్తుంది."






పూర్వం ఒక పండితుడికి లేకలేక ఒక మగపిల్లవాడు కలిగాడు. వాడి కాయన హరిశర్మ అని గొప్పగా పేరుపెట్టుకొన్నాడు. కాని హరిశర్మకు విద్యాబుద్ధులు ఏమాత్రమూ అంటలేదు. హరి అనే మాటకు విష్ణువు, ఇంద్రుడు, సూర్యుడు, చంద్రుడు, యముడు, సింహం, గుర్రం, కోతి, పాము, గాలి, కిరణం, చిలుక, కప్ప మొదలైన అర్థాలున్నాయి. తన కొడుకు పేరు కప్ప అనే అర్థంలోనే సార్థకమయిందని నమ్మి తండ్రి హరిశర్మను, "ఒరే, కప్పాయ్!" అని పిలుస్తూండేవాడు.

హరిశర్మ పెరిగి పెద్దవాడయినాడు. పెళ్ళి చేసుకున్నాడు. గంపెడు పిల్లల్ని కన్నాడు. వీరందరినీ పోషించలేక, సకుటుంబంగా ఒక పెద్దనగరం చేరాడు. స్థూలదత్తుడనే ఐశ్వర్యవంతుడి ఇంట సేవకుడుగా చేరాడు. హరిశర్మ భార్య ఇంటి పనులు చేసేది. పిల్లలు స్థూలదత్తుడి పశువులను కాస్తూండేవాళ్ళు.

కొన్నాళ్ళు జరిగాక స్థూలదత్తుడి కుమార్తె వివాహం వచ్చింది. పెళ్ళి ప్రయత్నాలు బ్రహ్మాండంగా చేశారు. వేలసంఖ్యలో పెళ్ళికి బంధుజనం వచ్చారు. హరిశర్మ సుఖమైన భోజనం చేసి చాలా కాలమయింది. ఈ పెళ్ళి పూర్తి అయేలోపల తన జిహ్వాచాపల్యం ఎంతైనా తీర్చుకోవచ్చునని హరిశర్మ ఆశపడ్డాడు. కాని తీరా పెళ్ళినాడు అతన్ని పెళ్ళికి ఆహ్వానించినవారుకూడా లేరు.

హరిశర్మకు తల తీసేసినట్టయింది. "నాదగ్గిర డబ్బుగాని ప్రజ్ఞగాని లేకపోవటం చేతకదా నన్ని కోటీశ్వరుడు ఇంత అమర్యాద చేశాడు. ప్రజ్ఞ లేనివాళ్ళు ఎందరో ఉన్నట్టు నటిస్తున్నారు. నేనూ ఆ పనే చేసి గౌరవం సంపాదిస్తాను," అనుకుని, హరిశర్మ ఆరాత్రి అందరూ గాఢనిద్రలో వున్న

బి. స్వర్ణలత



సమయంలో, పెళ్ళికొడుకు ఎక్కి ఊరేగే పంచకల్యాణి గుర్రాన్ని తీసుకుపోయి, ఊరి దక్షిణపు పొలిమేరవద్ద ఒక చెట్టుకు కట్టి ఇంటికి తిరిగివచ్చాడు.

మర్నాడు తెల్లవారుతూనే పెళ్ళివారు పెళ్ళికొడుకు గుర్రం కనపడక తల్లడిల్ల సాగారు. భర్త పంపించగా హరిశర్మ భార్య స్థూలదత్తుడిదగ్గిరికి వెళ్ళి, "బాబూ, అల్లుడు గారి గుర్రం కనిపించటంలేదని విన్నాను. మా ఆయనను పిలిచి ప్రశ్న అడగండి. ఆయనకా విద్య బాగా తెలుసు," అన్నది.

వెంటనే స్థూలదత్తుడు హరిశర్మను పిలిపించి గుర్రం ఎవరెత్తుకుపోయినదీ తెలిస్తే



చెప్పమని వేడుకున్నాడు. హరిశర్మ నేల మీద పుల్లతో ఏవో గీతలు గీసి, వేళ్ళు లెక్కపెట్టి, "అల్లుడుగారి గుర్రాన్ని రాత్రి దొంగలెత్తుకు పోయారు. అది ఈ క్షణంలో ఈ ఊరి దక్షిణపు పొలిమేరమీద ఒక చెట్టుకు కట్టబడివున్నది. వెంటనే మనుషులు వెళితే దొరకవచ్చు," అన్నాడు.

పెళ్ళికొడుకు గుర్రం హరిశర్మ చెప్పినట్టే దొరికింది. దానితోబాటు హరిశర్మకు కీర్తి కూడా కలిగింది. స్థూలదత్తు డాయనకు పెళ్ళిలో ఘనంగా మర్యాదలు చెయ్యటమే గాక, తరవాత పెద్దజీతం ఇచ్చి ఇంట సలహాకు ఉంచుకున్నాడు.

ఇది జరిగిన కొద్దికాలానికే రాజుగారింట రత్నాభరణాలు యెవరో దొంగిలించారు. రాజు హరిశర్మను పిలిపించాడు. ఒకరోజు గడువిస్తే చెబుతానన్నాడు హరిశర్మ. కోటలోనే ఆయనకు ఒక గది ఇచ్చి, దొంగతనం పట్టుకునేదాకా అందులోనే ఉండమన్నారు హరిశర్మను. అతడు ఒప్పుకున్నాడు.

నిజంగా ఈ దొంగతనం చేసినవాళ్ళు జిహ్వ అనే దాసీదీ, దాని అన్నా. దొంగలను పట్టటానికి గట్టివాణ్ణి పిలిపించారని తెలిసి జిహ్వకు గుండె దడగానే వుంది. ఆ రాత్రి అంతా నిద్రపోయేవేళ అది హరిశర్మ వుండే

గదికి వెళ్ళి, తలుపుదగ్గిర చెవిపెట్టి విన్నది. హరిశర్మ గది లోపల కూచుని తననుతాను నిందించుకుంటున్నాడు. పెళ్ళిలో పంచ భక్ష్యపరమాన్నాలు దొరకలేదనేకదా తాను ప్రశ్నలు చెప్పగలవాడల్లే నటన ఆరంభించింది! జిహ్వాచాపల్యం ఇప్పుడు తనకు ప్రాణాలమీదికి తెచ్చింది.

"ఓసి పాపిష్టి జిహ్వా! ఎంతపనిచేశావే? ఇప్పుడనుభవిస్తావులే. దొంగతనం బయట పెట్టకపోయావే, రాజుగారు నిన్ను నిలువునా చీల్చేస్తారు!" అంటున్నాడు హరిశర్మ.

ఈ మాటలు వినగానే జిహ్వకు ముచ్చెమటలు పోశాయి. అది తలుపు తోసుకుని వచ్చి, హరిశర్మ కాళ్ళమీద పడి, "బాబో, నా ప్రాణం కాపాడండి. బుద్ధినేరక దొంగతనం చేశాను. ఈ తప్పు కాయండి!" అంటూ భోరున ఏడవసాగింది.

హరిశర్మ తన అదృష్టం పండిందని తెలుసుకున్నాడు.

"ఓసీ, నిన్ను రాజుగారు దండిస్తే నాకేం వస్తుంది? సొమ్ము ఎక్కడ దాచావో చెప్పు, నిన్ను కాపాడతాను," అన్నాడాయన జాలిపడుతున్నట్టు.

"బాబూ, బ్రతికినన్నాళ్లూ మీకు రుణపడివుంటాను. వాటిని తోటలో దానిమ్మ చెట్టు కుదుట్లో దాచాను," అన్నది జిహ్వ.



హరిశర్మ దాసీదాన్ని పంపేసి, తెల్లవార గానే నేరుగా మంత్రిదగ్గిరికి వెళ్లి, "పోయిన సొత్తు పట్టిస్తాను, రండి," అన్నాడు.

దానిమ్మచెట్టు కుదురు తవ్వగా పోయిన రత్నాభరణాలన్నీ దొరికాయి. రాజుగారి ఆనందాశ్చర్యాలకు మేరలేదు. ఆయన హరిశర్మకు గొప్ప బహుమానమిచ్చి, కొలువులో ఉంచుకోవాలనుకున్నాడు.

కాని మంత్రికి హరిశర్మలో గురి కుదర లేదు. ఈ హరిశర్మకు విద్యాసంస్కారాలేమీ ఉన్నట్టు లేదు. ఇటువంటివాడిదగ్గిర దివ్యదృష్టిగాని, ప్రతిభగాని ఉంటుందని మంత్రికి తోచలేదు. అందుకని, మంత్రి ఒక చిన్న కప్పను పట్టి, దాన్ని ఒక కుండలో పెట్టి, కుండకు వాసెన కట్టి హరిశర్మదగ్గిరికి తెచ్చి, రాజు వింటుండగా, "స్వామీ, తమరు తెలుసుకోలేనిదంటూ లేదు. ఈ కుండలో ఏమున్నదో చెప్ప గలరా?" అని అడిగాడు.

ఈ దెబ్బతో తన రహస్యం బయటపడిం దనుకున్నాడు హరిశర్మ. తన చదువును తండ్రి చిన్నతనంలో పరీక్షించినప్పుడు హరిశర్మకు ఇటువంటి మనస్థితే కలిగేది.

"చిక్కావు కప్పాయ్?" అన్నాడు హరిశర్మ, అప్రయత్నంగా తన తండ్రి మాటలు స్మరిస్తూ.

మంత్రి కాస్సేపు నివ్వెరబోయి, హరిశర్మ కాళ్ళు పట్టుకుంటూ:

"స్వామి, తమ శక్తిని శంకించిన పాపాత్ముణ్ణి! క్షమించాలి!" అన్నాడు. దానితో రాజుగారికి హరిశర్మ శక్తిసామర్థ్యాల మీదవున్న నమ్మకం యినుమడించింది. అతడిని అందరూ గౌరవించసాగారు.

హరిశర్మకు చదువు సంధ్యలు లేక పోయినా అదృష్టం కలిసివచ్చింది. ఆయన ఆ రాజుగారి కొలువులోనే చాలాకాలం ఉండి, భార్యా బిడ్డలతోసహా సకల సౌభాగ్యాలూ అనుభవించాడు.






## 18

[శిథిలనగరంనుంచి పారిపోతున్న వ్యాఘ్రదత్త, సమరసేనులకు ఏకాక్షిమాంత్రికుడు ఎదురైయ్యాడుగదా? అప్పుడు సమరసేనుడు మాంత్రికుడి కంట బడకుండా తప్పించుకున్నాడు. తనకు విరోధివర్గంలోనివాడైన సమరసేనుణ్ణి హతమార్చాలంటే, వ్యాఘ్రదత్తుడు తనకు అన్నివిధాలా సహాయపడగలడని ఏకాక్షికి నమ్మకం కలిగింది. తరువాత—]

ఏకాక్షిమాంత్రికుడికి, వ్యాఘ్రదత్తుడి జవాబుతో పరిస్థితి అర్థమైపోయింది. తనలాగే అతడూ ధనరాసులతో వున్న నావకోసమే ప్రయత్నిస్తున్నాడని అతడు గ్రహించాడు.

"ధనరాసులతో వున్న నావను వశపరుచుకోవటం మానవమాత్రులకు సాధ్యమయే పని కాదని నీకు తెలియదా?" అని ప్రశ్నించాడు ఏకాక్షి.

అందుకు వ్యాఘ్రదత్తుడు తల పంకిస్తూ, "శాక్తేయుడి త్రిశూలం వున్నదిగదా?" అని జవాబిచ్చాడు.

శాక్తేయుడి త్రిశూలం పేరు వింటూనే ఏకాక్షి నిశ్చేష్టుడయాడు. తనకూ, చతుర్నేత్రుడికీ మాత్రమే ఆ త్రిశూలం సంగతి తెలుసునని అతడి నమ్మకం!

ఇక వ్యాఘ్రదత్తుడు ప్రాణభీతితో, ఆ త్రిశూలం శిథిలనగరంలోని ఏనుగుల వనంలో, గురుద్రోహి అస్థిపంజరంకింద ఉందని చెప్పేశాడు. శివదత్తుడు దానికోసం ప్రయత్నిస్తున్నాడనీ, సమరసేనుడుకూడా అక్కడికే పోయివుంటాడనీ వ్యాఘ్రదత్తుడు చెప్పగానే ఏకాక్షి క్రోధంతో వణికిపోయాడు.



"వ్యాఘ్రదత్తా! ఈ కార్యం సాధించటానికి మన యిద్దరం ఒకళ్ళకొకళ్ళు సహాయం చేసుకోక తప్పదు. సమరసేనుడికి, చతుర్నేత్రుడనే ఒక తుచ్ఛ మాంత్రికుడు ఈ కార్యంలో సహాయపడవచ్చు. కనుక ముందుగా మనం ఆ శిథిలనగరం చేరి శాక్తేయుడి త్రిశూలం చేజిక్కించుకోవటం ఉత్తమం. ముందుండి దారి చూపు," అన్నాడు ఏకాక్షి.

ముందు వ్యాఘ్రదత్తుడూ, అతడి భటులూ బయలుదేరారు. వెనక ఏకాక్షి తన వేగులతో నడవసాగాడు. కొంతదూరం వెళ్ళగానే ఏకాక్షి తన వేగులకేసి చూసి:



"కపాలా, కాలభుజంగా! మీరు ముందు వెళ్ళి ఆ సమరసేనుణ్ణి వెతకండి," అని అజ్ఞాపించాడు.

వేగులు వెళ్ళిన కొద్దిసేపట్లోనే ఏకాక్షీ, వ్యాఘ్రదత్తుడూ అదిరిపడేలా నల్లగూబ కంఠస్వరం వినబడింది. అది ఏకాక్షి తలమీదుగా ఎగురుతూ, "చతుర్నేత్రా, ఏకాక్షీ, ఏకాక్షి!" అని అరవసాగింది.

ఏకాక్షి భయంతో కంపించిపోతూ ఎడమచేతితో కన్ను మూసుకుని, కుడిచేతితో కత్తిని గాలిలోకి తిప్పుతూ "కపాలా, కాలభుజంగా!" అని కంపిస్తున్న కంఠంతో కేకలుపెట్టాడు. కాని అతడు ఎంత అరిచినా అతడి వేగులు అక్కడికి రాలేదు. ఇప్పుడు ఏమి చేయటమా అని అతడు ఆలోచించేంతలో నల్లగూబ అక్కడినించి ఎగిరిపోయింది.

వ్యాఘ్రదత్తుడూ, ఏకాక్షీ ఏనుగులవనం ప్రవేశించారు. అప్పుడు వ్యాఘ్రదత్తుడు "ఏకాక్షి మహాశయా! ఇదే ఏనుగులవనం! పడగ విప్పి బుసకొడుతున్న పాములవంటి ఆకులతో వున్నదే విషవృక్షం. ఆ కనబడే సమాధికిందే త్రిశూలం వున్నది" అన్నాడు.

ఆ మాటలతో ఏకాక్షి పరమానంద భరితుడయ్యాడు. "సరే వ్యాఘ్రదత్తా! నీ



భటులతో శివదత్తుణ్ణి ఎదుర్కో. ఈలోపల నేను త్రిశూలంసంగతి తేల్చుకుంటాను," అంటూ వ్యాఘ్రదత్తుణ్ణి ప్రోత్సహించాడు.

వ్యాఘ్రదత్తుడు ముందు వెనుకలు ఆలోచించకుండా వున్న కొద్దిమంది భటులతో శివదత్తుడి అనుచరులమీదికి దూకాడు.

శివదత్తుడి అనుచరులు వ్యాఘ్రదత్తుడి భటులకన్న మూడింతలు ఉన్నారు. ఆ కారణంచేత క్రమక్రమంగా వ్యాఘ్రదత్తుడి భటులు చావుదెబ్బలు తిని కిందపడసాగారు.

ఈ పరిస్థితిలో రానున్న ప్రమాదాన్ని గుర్తించాడు ఏకాక్షి. అతడు ఎలుగెత్తి, "కపాలా, కాలభుజంగా!" అంటూ అరవసాగాడు. చూస్తూ వుండగానే కపాలం, కాలభుజంగం అక్కడికి వచ్చినై.

శివదత్తుడి అనుచరులు వాటిని చూస్తూనే గుండెలదరి పారిపోసాగారు.

"వ్యాఘ్రదత్తా! ఇదే మనకు మంచి అదను. శాక్తేయుడి త్రిశూలం ఉన్న ఆ సమాధిప్రాంతాన్ని, నీభటులతో వెంటనే తవ్వించు," అన్నాడు ఏకాక్షి.

వ్యాఘ్రదత్తుడికూడా తన విజయం నిస్సందేహం అనిపించింది. సమరసేనుడూ, చతుర్నేత్రుడూ అక్కడికి వచ్చేలోపుగా తను ఆ దివ్యశక్తులు గల త్రిశూలం వశపరుచుకోవచ్చుననుకున్నాడు. అతడు తన





భటులను హెచ్చరిస్తూ ముందుకు దూకి మృతవీరుల సమాధిని స్వయంగా తవ్వసాగాడు అంతలో అక్కడికి వందగజాల దూరంలో వున్న విషవృక్షాన్నుంచి మూలుగులు వినిపించసాగినై. పడగ విప్పిన పాములవలె వున్న ఆ చెట్టు ఆకులు బుసలుకొట్ట ప్రారంభించినై.

ఏకాకి చెట్టును సమీపించాడు. తన చేతనున్న కత్తిని పైకెత్తి ఏదో మంత్రం పఠించనున్నంతలో, వ్యాఘ్రదత్తుడి కంఠంనుంచి జాలి కొలిపే ఆర్తనాదం వినిపించింది. ఏకాకి వెనక్కు తిరిగిచూశాడు. చతుర్నేత్రుడి వేగు నరవానరం వ్యాఘ్రదత్తుణ్ణి



చేతులతో బంధించి గిరగిర తిప్పుతున్నది. నల్లగూబ 'ఏకాకీ, ఏకాకీ!' అని అరుస్తూ విషవృక్షంకేసి వస్తున్నది.

ఏకాకి కంగారుపడ్డాడు. తను శాక్తేయుడి త్రిశూలాన్ని వెతికి పట్టుకోకముందే, చతుర్నేత్రుడూ, సైనికులతో సమరసేనుడూ ఆ ప్రదేశానికి రావచ్చని అతడికి భయం కలిగింది. అతడు కాలభుజంగాన్ని పిలిచి నరవానరంమీదికి ఉసికొలిపాడు. దూరంగా వున్న రాళ్లగుట్టలమీదికి వ్యాఘ్రదత్తుణ్ణి విసిరేసి, నరవానరం కాలభుజంగంతో కలియబడింది. పైన కపాలం, నల్లగూబ భయంకరంగా పోరాడసాగినై.

ఏకాకి భయపడినదంతా నిజమైంది. చతుర్నేత్రుడు 'ఉలూకా, నరవానరా!' అంటూ అక్కడికి రానేవచ్చాడు. సమరసేనుడి వెంట కొందరు సైనికులున్నారు. పారిపోతున్న శివదత్తుడూ, అతడి అనుచరులు కూడా కొంత తెప్పరిల్లి ఆ ప్రదేశానికి వస్తున్నారు. చావగా మిగిలిన వ్యాఘ్రదత్తుడి భటులు వాళ్లను ఎదుర్కొన్నారు.

కాలభుజంగం విషపుకోరలనుంచి తప్పుకుంటూ, నరవానరం దానిని ఒక పెద్ద రాతి సుత్తెతో కొట్టసాగింది. నల్లగూబకూడా, కపాలపు బోసినోటికి అందకుండా దానిని





కాళ్ళతో తన్నుతూ ముక్కుతో పొడవసాగింది. తన పరిస్థితి చాలా ప్రమాదకరంగా పరిణమిస్తున్నదని గ్రహించిన ఏకాకి కత్తి దూసి చతుర్నేత్రుడిమీదికి వచ్చాడు. చతుర్నేత్రుడుకూడా ఏమాత్రం జంకక అతణ్ణి ఎదుర్కున్నాడు. ఈలోపల చతుర్నేత్రుడి సలహాప్రకారం సైనికులను వెంటతీసుకుని సమరసేనుడు సమాధి తవ్వసాగాడు.

మృతవీరుల సమాధిని తవ్వుతున్న సమరసేనుడికి, లోనుండి వింత అరుపులూ వికృతమైన నవ్వులూ వినిపించసాగినై.

సమరసేనుడు భయపడలేదు. తమ నాయకుడి గుండెనిబ్బరం గ్రహించిన సైనికులు ఎట్లా అయితేం, మృతవీరుల సమాధిని అట్టడుగువరకూ తవ్వేశారు.

సమాధి అడుగున ఒకేఒక అస్థిపంజరం కనబడింది. అది గురుద్రోహి అస్థిపంజరం అని సమరసేనుడు గ్రహించాడు. ఆ అస్థిపంజరం గుండెల్లో నిలువునా గుచ్చుకుని శాక్తేయుడి త్రిశూలం కనబడింది. వణుకుతున్న చేతుల్తో సమరసేనుడు అస్థిపంజరం నుంచి త్రిశూలం బయటికి గుంజాడు. మరుక్షణం అస్థిపంజరం గాలిలోకి లేచి—

"గురూ, శాక్తేయా! ఈనాటితో నాకు శాపవిముక్తి కలిగింది. నేను తిరుగా శమన




ద్వీపానికి పోతున్నాను!" అంటూ రివ్వున గగనమార్గాన బయలుదేరింది.

అస్థిపంజరం అవిధంగా పలుకుతూ ఆకాశమార్గాన ఎగిరిపోవటం చూసేసరికి ఏనుగులవనంలో వున్న ప్రతి ఒక్కడికీ గుండెలు అవిసిపోయినై. ఏకాకి ఎత్తిన కత్తి అలాగేవుంచి, ఎగిరిపోతున్న గురుద్రోహి అస్థిపంజరానికేసి చూడసాగాడు. తడబడుతున్న అడుగులతో సమరసేనుడు చతుర్నేత్రుణ్ణి సమీపించి అపూర్వ శక్తులు గల శాక్తేయుడి త్రిశూలాన్ని అతడి చేతికి అందించాడు.

ఏకాకి తన దృష్టిని అస్థిపంజరంమీద నుంచి చతుర్నేత్రుడికేసి తిప్పేసరికి అతడి





కంటికి, మెరుస్తూన్న త్రిశూలం కనబడింది. వెంటనే ఒక చావుకేక పెట్టి, 'కాలభుజంగా! కపాలా!' అని అరుస్తూ పారిపోసాగాడు.

"చతుర్నేత్రా! ఆ పాపిని ప్రాణాలతో పోనీకండి. వెంటనే హతమార్చండి!" అన్నాడు సమరసేనుడు. అందుకు చతుర్నేత్రుడు నవ్వుతూ "సమరసేనా! ఆ ఏకాక్ష ఎక్కడికీ పారిపోలేడు. మనం ఏ క్షణాన కావాలంటే, ఆ క్షణాన, యీ త్రిశూలం—వాడెక్కడ దాగివున్నా సరే—హతమార్చగలదు," అంటూ త్రిశూలాన్ని ఏకాక్షికేసి విసురుతూ, "ఆ గురుద్రోహి తమ్ముడైన ఏకాక్షిని హతమార్చి రా!" అన్నాడు.



త్రిశూలం మెరుపులా గాలిలోకి ఎగిరింది. చూస్తున్నంతలో అది పారిపోతున్న ఏకాక్షిని సమీపించి బలంగా గుండెల్లో పొడిచింది. 'అబ్బా...!' అని అరుస్తూ ఏకాక్షి కింద పడిపోయాడు. త్రిశూలం తిరిగి వచ్చి చతుర్నేత్రుడి పాదాలముందు పడింది.

"చతుర్నేత్రా! పనిలోపని, ఆ కపాలుణ్ణీ కాలభుజంగాన్నికూడా తుదముట్టించు!" అన్నాడు సమరసేనుడు అమితోత్సాహంతో.

"ఏకాక్షి చావు తరవాత కపాలం, కాలభుజంగం ఎవరికీ ప్రమాదం కలిగించలేవు," అన్నాడు చతుర్నేత్రుడు.

తరవాత చతుర్నేత్రుడు ఒక క్షణం ఆగి "సమరసేనా! మనం కాలయాపన కాకుండా తూర్పుతీరం చేరి ఆ ధనరాసులతో వున్న నావను వశపరుచుకుందాం" అన్నాడు

వారు అడవిదారుల వెంటా, కొండలోయలగుండా నడిచి తూర్పుతీరం చేరారు. ధనరాసులతో నిండివున్న నావా, దానిని కాపలా కాస్తున్న నాగకన్యా ఎప్పటిలాగే సముద్రంలో తేలిఆడుతూ కనబడ్డారు.

చతుర్నేత్రుడు తన చేతనున్న శాక్తేయుడి అపూర్వ శక్తులు గల త్రిశూలాన్ని మంత్రించి నావవైపుకు విసిరాడు. త్రిశూలం మెరుపులా పోయి నావను తాకింది.



మరుక్షణంలోనే నాగకన్య, నావచుక్కానీ చేతబట్టి దానిని తీరానికి చేర్చింది.

"నేను శమనద్వీపపు రాజైన శాక్తేయుడి శిష్యుణ్ణి. నాపేరు చతుర్నేత్రుడు! ఇది మంత్రశక్తి గల అతడి త్రిశూలం. గురు వాజ్ఞ తెలుసుగదా! నువ్వు నా భార్యవు!" అన్నాడు చతుర్నేత్రుడు నాగకన్యతో.

నాగకన్య ఆ మాటలు వింటూనే చుక్కాని వదిలి, ముందుకు వచ్చి, చతుర్నేత్రుడికి ప్రణమిల్లింది. సమరసేనుడూ, సైనికులూ ఉత్సాహంతో జేజేలు కొట్టారు. అప్పుడు చతుర్నేత్రుడు, సమరసేనుడికేసి తిరిగి—

"సమరసేనా! ఈనాటినుంచి మేము భార్యాభర్తలం. ఈ మంత్రాలదీవిలో శాంతంగా కాలం గడపదలిచాం. నువ్వు వచ్చిన పని అయింది. ధనరాసులతో మీ కుండలినీద్వీపం చేరవచ్చు," అన్నాడు.

అప్పటికప్పుడే సమరసేనుడు ప్రయాణ సన్నాహం చేశాడు. అతడు చతుర్నేత్రుడికి కృతజ్ఞత తెలియపరిచాడు. చతుర్నేత్రుడు అతణ్ణి దీవించి, తన భార్య అయిన నాగకన్యతో అడవికేసి వెళ్ళిపోయాడు.

భూకంపాలతో భయంకర మృగాలతో, నిండివున్న మంత్రాలదీవి తమకు వాస యోగ్యం కాదని నిశ్చయించుకున్న శివదత్తుడూ, అతడి అనుచరులుకూడా, సమరసేనుడితో కుండలినీద్వీపానికి బయలుదేరారు. నిర్మలంగా ప్రశాంతంగా వున్న సముద్రంలో ఒక మాసం రోజులు ప్రయాణం చేసి, ఒకనాటి ఉదయకాలంలో అందరూ కుండలినీద్వీపం చేరారు.

అనేక సంవత్సరాల తరవాత తిరిగి వచ్చిన సమరసేనుడికి, సైనికులకూ ద్వీప ప్రజలూ, రాజైన చిత్రసేనుడూ ఘనమైన స్వాగతం యిచ్చారు. ఎన్నో ధనరాసులు గల ఓడనుకూడా వెంట తెచ్చినందుకు ప్రతి ఒక్కరూ పరమానందం పొందారు.

—('తోకచుక్క' కథ ముగిసింది)






పూర్వం విజయుడనే రాజుకు రత్నావళి అనే కుమార్తె ఉండేది. ఆమె చాలా చిన్న పిల్లగా ఉండగా ఆమె దాది రోజూ ఒక కథ చెప్పేది. ఆ కథ ఏమంటే—

"అనగనగా ఒక అరణ్యంలో ఒక అడవిపావురాల జంట ఉండేది. లేక లేక వాటికి నాలుగు పిల్లలు పుట్టాయి. ఒక నాడు అరణ్యంలో కార్చిచ్చు బయలుదేరి, ఇంకా ఎగరలేని స్థితిలో ఉన్న ఆ పిల్లలను దహించివేసింది. ఇది చూసి ఆడపావురం చాలా దుఃఖించింది 'నా పిల్లలు పోయాక నేనుమాత్రం బతకటం దేనికి. ఆ మంటల్లోనే పడి ఆత్మహత్య చేసుకుంటా'నన్నది. మగ పావురం తానుకూడా ఆత్మహత్య చేసుకుంటానని బయలుదేరింది. కాని సగం దారిలో మగపావురం, "మనం ఆత్మహత్య చేసుకోవద్దు. మనం ఉంటే ఇంకా పిల్లలు కలగవచ్చు. మనమే పోతే ఇంకేముంది?' అన్నది. 'ఛీ! నీకు పిల్లలు పోయిన విచారమే లేదు. నేను నీ మాట వినను,' అంటూ ఆడపావురం వొంటరిగా వెళ్ళి మంటల్లో పడి చచ్చిపోయింది. లోకంలో ఎవరినన్నా నమ్మవచ్చుగాని మగవాళ్ళను నమ్మకూడదు!"

ఈ కథ విని రాజకుమార్తె దాదిని, "చచ్చిపోయిన ఆడపావురం ఏమయింది?" అని అడిగేది.

దాది నవ్వుతూ, "ఆ పావురమే మా రాజుగారి కడుపున ఇలా పుట్టింది," అని రాజకుమార్తెను ముద్దులాడేది.

కొద్దికాలానికి ఆ దాది చనిపోయింది.

కాని రాజకుమార్తె, దాది చెప్పిన అడవి పావురాల కథా, మగవారిని నమ్మరాదనే నీతీ, మాత్రం మరిచిపోలేదు.

రత్నావళి ఒకనాడు తండ్రితో, "నాన్నా, నాకోసం తోటలో ప్రత్యేకంగా బంగళా

కె. కుమారస్వామి



కట్టించు. అందులో నేనూ నా చెలికత్తెలూ మాత్రం ఉంటాం. అటుకేసి మగపురుగెవరూ రాకుండా కట్టుదిట్టం చేయించు," అని అడిగింది.

"అదేమిటి? నేడో రేపో నీ పెళ్ళి చేద్దామనుకుంటున్నామే?" అన్నాడు తండ్రి.

"ఈ జన్మలో కాదుగదా వెయ్యి జన్మలెత్తినా నేను పెళ్ళాడేది కల్ల!" అని చెప్పింది రత్నావళి.

కొంతకాలం గడిచింది. దూరదేశం నుంచి ఒక రాజు కొడుకూ మంత్రి కొడుకూ వచ్చారు. రత్నావళి ఉండే బంగళాచుట్టూ ఉన్న తోటను చూసి, అక్కడ కాస్సేపు విశ్రాంతి తీసుకుని ముందుకు పోదామని అందులో ప్రవేశించారు.

వారు తోటలోకి అడుగుపెట్టిన క్షణంలోనే, "పొండి, పొండి! ఇక్కడ పురుషులు అడుగుపెట్టరాదు. మీరు పరదేశీయుల్లాగా ఉన్నారు. ఇది మా రాజకుమార్తె రత్నావళీదేవి బంగళా. ఇక్కడికి పొరబాటుగ వచ్చినా మా రాజుగారు తీవ్రంగా దండిస్తారు," అంటూ ఒక దాసీది అరుచుకుంటూ అక్కడికి వచ్చింది.

"మేమేం మీ రత్నావళిని ఎత్తుకుపోతామా?" అన్నాడు రాజకుమారుడు.

"మా దేవిగారికి పురుషుల పొడకూడా గిట్టదు. తెలిసిందా? వేగిరం వేంచెయ్యండి," అన్నది దాసీది.

ఇద్దరూ తోటనుంచి బయటికి వచ్చేశారు.

"మిత్రమా, ఈ పురుషద్వేషిణిని పెళ్ళాడితీరాలని నా అంతరాత్మ చెబుతున్నది. ఏమిటి సాధనం?" అన్నాడు రాజకుమారుడు.

"అసలామె ఎంత అనాకారిమనిషో? నేను విచారించి చూస్తాలే," అన్నాడు మంత్రికుమారుడు.

ఇద్దరూ నేరుగా నగరానికి వెళ్లి పేదరాసి పెద్దమ్మ ఇంట బస ఏర్పరుచుకున్నారు.

"అవ్వా, మీ రాజుకూతురికి పురుష ద్వేషంట! కురూపి కాదుగద?" అన్నాడు మంత్రికుమారుడు.

"మా రత్నావళి చక్కని చుక్క కాదూ!" అన్నది పెద్దమ్మ.

"అయితే ఈ పురుషద్వేషానికి కారణం?" అని అడిగాడు మంత్రి కుమారుడు.

"ఈ సంగతి మళ్ళీ ఎక్కడా అనకండి, బాబూ! పరమ రహస్యం. రత్నావళి కిందటి జన్మలో ఆడపావురం. పెట్టక పెట్టక పిల్లల్ని పెడితే అగ్నిదేవుడు పొట్టన పెట్టుకున్నాడు. ఆడపావురమూ, మగ పావురమూ కలిసి ఆత్మహత్య చేసుకుందా మనుకున్నాయి. ఆఖరు క్షణంలో మగ పావురం ఎటో తప్పించుకు పారిపోయింది. ఆడపావురం మంటల్లో పడి చనిపోయి మా రాజు కడుపున పుట్టింది," అన్నది పేద రాసి పెద్దమ్మ

"ఈ రహస్యం ఎవరు కనిపెట్టారవ్వా?" అని అడిగాడు మంత్రికొడుకు.

"అయ్యో, నాయనా! రత్నావళికి పూర్వజన్మ జ్ఞానం ఉంది," అన్నది అవ్వ.

"ఓహో, అలాగా?" అంటూ మంత్రి కుమారుడు కర్తవ్యం ఆలోచించాడు.




మర్నాడు తెల్లవారుతూనే రాజుకొడుకూ, మంత్రికొడుకూ పేదరాసిపెద్దమ్మదగ్గర సెలవు పుచ్చుకుని బయలుదేరారు. వారు ఊరి బయటిదాకా వెళ్ళి అక్కడ వేషాలు మార్చుకుని తిరిగివచ్చారు. రాజుగారి ఆస్థానానికి నేరుగా వెళ్లారు.

"మీరెవరు? ఏ దేశంవారు?" అని రాజు మామూలు ప్రశ్నలు వేశాడు.

"మహారాజా, మాది నేపాళం. వీరు నా గురువుగారు. ఇంద్రజాలంలో ప్రపంచంలో వీరికి సాటి ఎవరూ లేరు. వీరు జల స్తంభన, వాయుస్తంభన, అగ్నిస్తంభన వగైరా విద్యలన్నీ చూపిస్తారు. ఎడారిలో



మహారణ్యాలు పుట్టిస్తారు. ఎండిపోయిన చెట్లమీద పళ్ళు పండిస్తారు. తమరు మెచ్చి తగిన బహుమానం ఇవ్వాలి," అన్నాడు మంత్రికుమారుడు.

"మంచిది. ఈ ప్రదర్శనాన్ని తోట బంగళావద్ద ఏర్పాటుచేస్తాం. మా అమ్మాయి కూడా చూస్తుంది," అన్నాడు రాజు.

మంత్రికుమారుడు ఆందోళన అభినయిస్తూ, "మహారాజా, వద్దు! మా గురువుగారు స్త్రీద్వేషి. ఆడవారిని చూడరు. మీ బహుమానం లేకపోయినా మానె, వ్రతభంగం కావటానికి ఎంతమాత్రం వీలులేదు," అన్నాడు.

"ఓహో, అలాగా? పోనీ, స్త్రీజనం రహస్యంగా కూచుని అయినా ప్రదర్శనం చూడవచ్చునా?" అన్నాడు రాజు.

"వారు కనిపించరాదు. వారి గొంతు వినిపించరాదు." అన్నాడు మంత్రి కుమారుడు.

ఆ ప్రకారమే ఏర్పాట్లు జరిగాయి. తోట బంగళా ఆవరణలో స్త్రీలకు ప్రత్యేక స్థలం ఏర్పాటుచేసి స్త్రీలు కనిపించకుండా తెరలు కట్టారు.

ఇంద్రజాలం ప్రారంభించటానికి రాజు కొడుకు లేచినిలబడి ఇలా చెప్పసాగాడు:

"నా విద్యలను స్త్రీలు సరిగా చూడలేకపోతే ఏలినవారు నన్ను మన్నించాలి. నాకుగల స్త్రీద్వేషానికి కారణం చెబుతాను. నాకు పూర్వజన్మ జ్ఞానం ఉన్నది. నేను కిందటి జన్మలో ఒక అడవిపావురాన్ని. నేనూ నా భార్యా ఎంతో అన్యోన్యంగా ఉండేవాళ్ళం. మాకు లేకలేక పిల్లలు కలిగితే అగ్నిదేవుడు వాటిని పొట్టను పెట్టుకున్నాడు. నేనూ నా భార్యా ఆత్మహత్య చేసుకుందామనుకున్నాం. ఆఖరు క్షణంలో నా భార్య ఎటో వెళ్ళిపోయింది. నేను మాత్రం స్త్రీలను ఏ జన్మలోనూ నమ్మరాదనుకుంటూ అగ్నిలో పడి ప్రాణాలర్పించి, అ

పుణ్యం ఫలితంగా ఈ జన్మలో ఇంద్రజాల విద్యతో పుట్టాను. జన్మజన్మాలకూ నా భార్యకు వివాహం ఉండదు. ఇదే ఆమెకు నా శాపం! నేనుకూడా స్త్రీని ద్వేషిస్తాను."

ఇదంతా వింటున్న రత్నావళి తెర తోసుకుని ముందుకు వచ్చి, "అబద్ధం, పచ్చి అబద్ధం! సంతాన శోకంతో మరణించింది నేను! నువే ఎటో ఎగిరిపోయావు!" అన్నది.

"నేనా? నేను మరుక్షణమే మంటలలో పడిపోయాను. నన్ను మోసగించినది నువే!" అన్నాడు రాజకుమారుడు.

"మనం బతికుంటే మళ్ళీ పిల్లలు పుడతారన్నావు. నువే మోసగాడివి," అన్నది రాజు కూతురు.

"నీ దీక్ష పరీక్షించటాని కలా అన్నాను గాని, భగవంతుడికి పిల్లల నివ్వాలనే ఉంటే కలిగిన పిల్లలను మంటలపాలు చేస్తాడా? నువే మోసగత్తెవు! నేనా మాట అనగానే నువు మరొక దిక్కుగా పారిపోయి ప్రాణం రక్షించుకున్నావు," అన్నాడు రాజుకొడుకు కోపం నటిస్తూ.

"అయిందేదో అయిపోయింది! గురూ. మీరు మీ భార్యను క్షమించి ఏలుకోండి. మిమ్మల్ని ఆ పరమేశ్వరుడే కలిపాడని మేమంతా అనుకుంటున్నాం," అన్నాడు మంత్రికుమారుడు.

రాజకుమారుడు ప్రసన్నుడై రత్నావళిని సమీపించి, "నేను నీకు అన్యాయం చేసివుంటే క్షమించు. నువు మంటలలో దూకలేదనుకున్నాను," అన్నాడు.

"నేనే పాపిష్టిదాన్ని! నన్ను చావనిచ్చి మీరు తప్పించుకు పోయారనుకున్నాను. నన్నే మీరు క్షమించాలి," అన్నది రత్నావళి.

చివరకు రాజకుమారుడు చేసిన ఇంద్రజాలం రత్నావళియొక్క స్త్రీద్వేషాన్ని పోగొట్టటమే! ఇందుకు బహుమానంగా రాజు అతనికి రత్నావళి నిచ్చి శుభముహూర్తాన పెళ్ళిచేసేశాడు.






# పండితుడి ఆవు

ఒక గ్రామంలో ఒక పేద పండితుడుండేవాడు. ఆయనకు పాండిత్యమైతే ఉంది గాని లోకజ్ఞానం బహు తక్కువ. ఒకనాడు పొరుగూరివారెవరో ఈ పండితుణ్ణి పిలిచి ఒక గోవును ఆయనకు దానం ఇచ్చారు. ఇంతకాలానికి తనకు పాడి దొరికిందిగదా అని సంతోషిస్తూ పండితుడు ఆవుమెడకు పలుపు కట్టి, దాని చివర పట్టుకుని తన గ్రామానికి ప్రయాణమైనాడు.

మధ్య దారిలో ఒక అడవి వుంది. నిర్జనమైన అడవిమార్గాన ఆవును వెంటబెట్టుకు పోయే పండితుణ్ణి ఒక పొదచాటునుంచి ఇద్దరు దొంగలు చూశారు.

"ఇతనెవరో అమాయక బ్రాహ్మడులా వున్నాడు. చుట్టుపట్ల ఎక్కడా జనసంచారం లేదు. నేను చెప్పినట్టు చేస్తివా, మనం ఆ ఆవును కాజెయ్యవచ్చు," అన్నాడు పెద్దదొంగ. రెండోవాడు సరేనన్నాడు.

ఇద్దరు దొంగలూ చప్పుడు చెయ్యకుండా వెనకనుంచి ఆవును సమీపించారు. పెద్ద దొంగ ఆవుమెడలో పలుపు ఊడదీసి తన మెడలో వేసుకుని నడవసాగాడు.

రెండో దొంగ ఇదే మంచి సమయమను కొని ఆ ఆవును చప్పుడుకాకుండా అక్కడి నుంచి వెనక్కు తోలుకుపోయాడు.

తన అనుచరుడు చూపుమేర దాటగానే, మెడకు పలుపువేసుకున్న దొంగ పలుపును గుంజసాగాడు. ఆవు ఇలా చేస్తున్నదేమా అని పండితుడు వెనక్కు తిరిగి, ఆవుకు బదులు మనిషిని చూసి, నిర్ఘాంతపోయి నిలిచిపోయాడు.

దొంగ ఆయనకు నమస్కారం చేసి, "స్వామీ, తమ దయవల్ల నాకు శాపవిమోచనం అయింది. నన్ను మళ్ళీ మనిషిని చేశారు. తమ ఋణం ఏవిధంగా తీర్చుకోగలను?" అన్నాడు.

ఆర్. లక్ష్మణరావు

"నీ శాపం ఏమిటి? తీరటమేమిటి?" అని అడిగాడు పండితుడు.

"స్వామీ, నాకు తండ్రి చిన్నతనంలోనే పోయాడు. నాతల్లి నన్ను ఎంతో శ్రమపడి పెంచింది. కాని నేను ఆకతాయినైపోయి, అల్లరిచిల్లరగా తిరుగుతూ, తాగుడూ, జూదమూ నేర్చి, నా తల్లిని చాలా ఉసురు పెట్టాను. అది చూసి నా తల్లి "ఓరీ, నువు పశువువైపోయి అందరిచేతా దెబ్బలు తిను. అప్పుడుగాని నీకు బుద్ధిరాదు," అన్నది.

"నేను ఆమె కాళ్ళావేళ్ళా పడగా అవిడ నాయందు దయదలిచి 'ఓరీ, నిన్ను పండితు డెవరైనా దానం పట్టినప్పుడు శాపవిముక్తి అవుతుంది!' అని అనుగ్రహించింది. తమరు పండితులు కాబోలు. అందుచేత నన్ను తమరు దానంపట్టగానే మళ్ళీ మనిషినయాను," అన్నాడు దొంగ.

ఈ కథ విని పండితుడు చాలా సంతోషించాడు.

"నాయనా, నాకు గోవు లేకపోతే మానె నీకు ఘోరమైన శాపం తొలిగిపోయింది. అంతే చాలు. వెళ్ళిరా! ఇకనైనా నీ తల్లి మాట జవదాటక బుద్ధిగా బతుకు," అన్నాడాయన దొంగతో.

దొంగ పండితుడికి నమస్కారం చేసి ఆయనవద్ద సెలవు పుచ్చుకున్నాడు. తరు



వాత దొంగలు ఆ ఆవును గోదానం చేసిన వారింటికే తీసుకుపోయి:

"అయ్యా, మా యజమాని ఈ ఆవును ఎక్కడన్నా అమ్మి రమ్మన్నారు. ఆయనకు డబ్బు అవసరంగా వున్నదట. దయవుంచి మీరే ఏదో ఒక ధరకు తీసుకోండి" అన్నారు.

పండితుడికి డబ్బు అవసరంపడిందని అనుకుని ఆ గృహస్థు తాను దానమిచ్చిన ఆవును తిరిగీ మంచి ధర ఇచ్చి దొంగల వద్దనుంచి కొన్నాడు.

దొంగలు, గృహస్థు ఇచ్చిన డబ్బు తీసుకుని తమ దారిన తాము పోయారు.

ఈలోపల పండితుడు తనకు జరిగిన విచిత్రమైన అనుభవం ఊరిలోవారందరికీ విస్తారంగా చెప్పాడు. అది విన్నవారందరూ తమలోతాము నవ్వుకున్నారు. ఆయన నెవరో మోసంచేశారని అందరికీ తెలిసి పోయింది. క్రమంగా ఈ వార్త పొరుగూరికి కూడా పాకింది.

మొదట పండితుడికి గోవును దానం చేసిన గృహస్థు పండితుడికి మళ్ళీ కబురు పంపాడు. పండితుడు వచ్చాడు.

"తమకు దానంచేసిన ఆవు తప్పించుకుని మళ్ళీ మా యింటికి వచ్చేసింది. దానమిచ్చినదాన్ని ఇంట కట్టేసుకోవటం భావ్యంకాదు. మీ ఆవును మీరు తోలుకుపోండి," అంటూ గృహస్థు పండితుణ్ణి పశువులశాలకు తీసుకుపోయాడు.

అదే ఆవు మళ్ళా కళ్ళబడేసరికి పండితుడికి ఆశ్చర్యమూ, కోపమూ వచ్చాయి.

"ఓరి, భడవా! మళ్ళీ తాగుడూ, జూదమూ సాగించావా? పెద్దవాణ్ణి నేను చెప్పినందుకైనా మంచిగా ఉండనక్కర్లా? నీవంటి పాపిని నేను మళ్ళీ దానంపట్టి శాపవిమోచనం చేస్తాననుకున్నావా? నీకర్మ నువే అనుభవించు!" అంటూ పండితుడు, గృహస్థు ఎంత బతిమాలుతున్నా వినిపించుకోకుండా ఇంటిదారి పట్టాడు.






# కపట యోగి

పూర్వం కురురాజ్యంలోని పాంచాల నగరానికి రేణుకుడు ప్రభువుగా ఉండేవాడు. ఆ కాలంలో హిమాలయపర్వతాల్లో ఐదువందలమంది సాధువులకు గురువైన మహారక్షితుడనే తపస్వి ఉండేవాడు.

ఒకప్పుడు మహారక్షితుడు, శిష్యవర్గాన్ని వెంటబెట్టుకుని దేశసంచారం చేస్తూ, పాంచాలనగరం చేరుకున్నాడు. తన రాజ్యంలోకి ఇంతమంది సాధువులు గల బృందం వచ్చినట్లు విని, రాజు చాలా సంతోషించాడు వారందరికీ అర్ఘ్యపాద్యాదులిచ్చి, ఉచితాసనాలిచ్చి, గొప్పగా సత్కరించాడు. ఉద్యానవనంలో వారికి సమస్త సదుపాయాలతోనూ వసతులేర్పరిచి, 'మీ యిష్టమొచ్చినంత కాలం ఇక్కడ ఉండండి!' అని స్వయంగా కోరాడు.

వర్షఋతువు గడిచేవరకూ మహారక్షితుడూ, శిష్యగణమూ అక్కడనే కాలక్షేపం చేసి, రాజువద్ద సెలవు పుచ్చుకుని మళ్ళీ హిమాలయాలకు బయల్దేరారు. దారి మధ్యలో వారు విశ్రాంతికోసం ఒక చెట్టు నీడని కూర్చొని, రాజువల్ల తాము పొందిన సహాయంసంగతి చెప్పుకోసాగారు.

ఆ ప్రసంగంలో 'రాజుకు సంతానప్రాప్తి వున్నదా, లేదా?' అనే సమస్య వచ్చింది. శిష్యగణంలో వుండే జ్యోతిష ప్రవీణులు చర్చలు జరిపారు. చివరకు, గురువైన మహారక్షితుడు 'రేణుకునికి దైవాంశ సంభూతుడైన ఒక చక్కటి కుమారుడు కల్గుతాడు' అని తన అభిప్రాయం వెల్లడించాడు. ఆయన వాక్శుద్ధి కలవాడని అందరకూ తెలుసు. అందుచేత, రాజుకు మేలు కలుగబోతున్నదనుకున్నారు.

ఐతే- ఈ చర్చ ముగియగానే శిష్యులలో ఒకడికి దుర్బుద్ధి పుట్టింది. వాడు వంట్లో జబ్బుగా వున్నట్టు నటించి, 'మీరు సాగుతూ



వుండండి. నేను వెనకనించి వస్తా' అంటూ, తగ్గాడు. తక్కిన అందరూ వెళ్ళిపోయారు.

వెనక్కు తగ్గి నిలిచిపోయిన ఆ దుష్ట బుద్ధి, వాయువేగంతో పాంచాలనగరం చేరుకుని, తన రాకను రాజుకు ఎరుక పరిచాడు. రాజుకు ఈ వార్త ఆశ్చర్యం కొల్పింది. ఆయన స్వయంగా ఎదురు వెళ్లి, ఘనంగా స్వాగతమిచ్చి, 'మహాను భావా!—ఇంతలోనే తిరిగివచ్చిన కారణం మేం తెలుసుకోవచ్చా?' అని ఆత్రంతో ప్రశ్నించాడు.

అందుకు దుష్టబుద్ధి 'ఓయీ రాజా!—మేమంతా విశ్రాంతి తీసుకొంటున్న సమయాన, సజ్జనుడవైన నీవు మా తలపునకు వచ్చినావు. నీ కేమి మేలు చేయగలమా? అని యోచించాము. 'రాజుకు వంశం నిలబడుతుందా, లేదా?' అని ప్రశ్న కలిగింది. అప్పుడు మేము దివ్యదృష్టివల్ల, నీకు దైవాంశసంభూతుడైన చక్కటి కుమారుడు పుడతాడని తెలుసుకొని, ఈ వార్త చెప్పి పోదామని వచ్చాము. వచ్చిన పని తీరింది. పోయివస్తాం' అంటూ మరలిపోబోయాడు.

ఆనందభరితుడైన రాజు సాధువును కదలనీయలేదు. 'మహాత్మా!—తాము సామాన్యులు కారు, దివ్యచక్షులు. ఇక్కడనే ఉండిపోవాలి...' అంటూ ప్రాధేయపడి, ఆ దుష్టబుద్ధికి ఉద్యానవనంలో చక్కటి వసతి ఏర్పరిచి, దేవునికంటె ఎక్కువగా కొలుస్తూ వచ్చాడు. నాటినుంచీ ఆ కపటయోగికి 'దివ్యచక్షు'డనే పేరు వాడుకలోకి వచ్చింది.

పాచిక పారిందికదా అని దివ్యచక్షుడు ఉబ్బిపోయాడు. తనకు వసతిగా ఏర్పరిచిన ఉద్యానవనంలో ఒక మూల కూరలు కాపించి, వాటిని తోటమాలీల ద్వారా అమ్మించి, ధనం గడించసాగాడు.

ఈ సమయంలో బోధిసత్త్వుడు రేణుక మహారాజుకు కుమారుడుగా జన్మించాడు. వరప్రసాదంగా పుట్టిన పసివాడికి 'సుమన

సుడు' అని పేరు పెట్టి, అల్లారుముద్దుగా పెంచుకొంటున్నారు.

సుమనసుడు ఏడేళ్లవాడైయ్యుండగా, రేణుకుడికి సామంతరాజులతో యుద్ధం పొసగింది. తండ్రి ఇంట లేనప్పుడు సుమనసుడు ఒకనాడు ఉద్యానవనం చూడబోయాడు. అక్కడ ఒకమూల-కాషాయ వస్త్రాలు ధరించిన సాధువు మొక్కలు తడుపుతూ, కూలివానికంటె ఎక్కువగా కాయకష్టపడడం సుమనసుడు చూచాడు. బుద్ధికుశలుడైన సుమనసుడికి వెంటనే నిజం తెలిసిపోయింది. వాడికి తగిన శాస్తి చేయాలని నిశ్చయించి:

'అరే, తోటమాలీ!— ఇక్కడ నువ్వు చేస్తున్నదేమిటి?' అంటూ సాధువును కోపంగా పలకరించాడు.

బిత్తరపోయాడు దివ్యచక్షుడు. ఇప్పటి వరకూ ఎంతో ఘనంగా కాలక్షేపం చేస్తూ వచ్చిన ఆ సన్యాసికి నలుగురిలో నగుబాటు కలిగింది. రాజకుమారుడు తన గుట్టు గ్రహించివేశాడనీ, ఇది ఎప్పటికైనా తనకు ప్రమాదమనీ వాడు తెలుసుకున్నాడు. సుమనసుడు బతికివుంటే తన గుట్టు వెల్లడవుతుందని రూఢిచేసుకుని, వానిని కడతేర్చటానికి వ్యూహం పన్నాడు.



సరీగా, రాజు తిరిగివచ్చేసమయానికి దివ్యచక్షుడు తను కూర్చునే ఆసనాన్ని ఒక పక్కకు నెట్టివేసి, కమండులువు ముక్కముక్కలుగా పగలగొట్టాడు. ఆశ్రమం చుట్టూ గడ్డీ, గాదం విరజిమ్మాడు. వళ్లంతా నూనె పూసుకొన్నాడు. బసలోకి పోయి, మూల్గుతూ పడుకొన్నాడు.

రాజు తిరిగివస్తూనే, ముందుగా తనకు గురుదేవుడైన దివ్యచక్షుని ఆశ్రమానికి వెళ్ళాడు. గుమ్మంముందు చిందరవందరగా ఉండటం చూసి, ఆశ్చర్యపోయాడు. లోపలికి పోయి చూడగా, యోగి మూల్గుతూ పడుకొనివున్నాడు!



కలవరపడుతూ రాజు, 'ఏమిటిదంతా?' అని ప్రశ్నించాడు.

'ఇంకేముంది, ఇదంతా నీ కొడుకు చేసిన పని!' అని తీరని విచారంతో చెప్ప లేక చెప్పలేక, వెల్లడించాడు కపట యోగి. వానియందు గొప్ప భక్తిగల రాజు, మారుయోచన లేకనే, 'సుమనసుడి తల గొట్టి నా యెదుట పెట్టండి!' అని అజ్ఞా పించాడు. తలారులు పోయి, తల్లిదగ్గిర కూర్చునివున్న సుమనసుడికి ఈ సంగతి విన్నవించారు.

సుమనసుడు తిన్నగా తండ్రివద్దకు వెళ్ళి, 'తండ్రీ!—నీ ఆజ్ఞకేమి అభ్యం తరం లేదు. నా తప్పేమిటో చెప్పి, నీ ఇష్టంవచ్చిన పని చేయవచ్చు,' అన్నాడు.

రాజు పట్టలేని కోపంతో 'ఛీ, బుద్ధి లేక ఇంకా మాటాడుతున్నావా? పవిత్రుడైనటు వంటి ఆ మహాత్ముణ్ణి 'తోటమాలీ!' అని పిలవడంకంటె ఘోరాపరాధం మరేమైనా వున్నదా?" అని కసరికొట్టాడు.

ఇందుకు సుమనసుడు 'తండ్రీ!—మహా త్ముడు, పవిత్రుడు అని నీవు పూజించే ఆ యోగి చేసే పనియేమిటో, ద్వారపాలకుల్ని కనుక్కో, తెలుస్తుంది,' అన్నాడు.

నాలుగు ద్వారాలలోనూ కాపలా కాసే వాళ్ళను పిలిపించారు. యోగి, రోజూ కూర గాయలు పండించి, రహస్యంగా విక్రయిస్తు న్నట్టు వాళ్ళు నలుగురూ ఒక్కమాటగా చెప్పారు. తరువాత వాని ఆశ్రమానికి పోయి పరీక్ష చేయగా, అపారమైన ధన రాసులు కనిపించినై. కొడుకు నిరపరాధి అని అప్పుడు తెలిసింది రాజుకు.

'తండ్రీ!—ఇప్పుడైనా తెలిసిందా, నే నెందుకు వానిని 'తోటమాలీ' అని పిలి చానో? ఆలోచన లేని రాజూ, అహంకార పూరితుడైన యోగీ న్యాయం నిలబెట్టే దేమిటి? ధర్మచ్యుతమైన ఈ రాజ్యంలో ఉండలేను' అన్నాడు సుమనసుడు.

రాజు తన తప్పిదానికి చాలా విచారించి, 'కుమారా !—నా తొందరపాటు మన్నించు. ఈ రాజ్యాన్ని ఇక నీవే యేలుకో' అని ప్రాధేయపడి కోరాడు.

ఇందుకు సుమనసుడు 'తండ్రీ!—మాటలే మంత్రాలు. మహిమగల మూలిక ఎంత పని చేస్తుందో, నోటివెంట వెలువడే మాట అంత పని చేస్తుంది. అనాలోచిత మైన మాట, యోచన లేని పనీ దుష్టమూలి కలవంటివి. దుష్టమూలిక ప్రయోగింపబడి నప్పుడు దాని ఫలితం అనుభవించే తీరాలి. అలానే మంచి మాటలు దివ్యమైన ఓష ధులలాగా మంచి ఫలితాలనిస్తవి. నీ నోటి వెంట వెలువడినవి దుష్టవాక్కులు! నీ ఆజ్ఞప్రకారం, నా తల్లిదగ్గర కూర్చుని వున్న నన్ను తలారులు తీసుకొనిపోబోయారు. ఇందుకు నిదానంమీద నీవు పశ్చాత్తాపం పొందవలిసిందే. నేనిప్పుడే నీ రాజ్యం విడిచి పోతున్నాను' అని చెప్పాడు.

సుమనసుడి మనసు ఎలా ఐనా తిప్ప మని రాజు రాణిని కోరాడు. కాని, ధర్మ చింత గల రాణి ఆ మాట పాటించలేదు. సుమనసుడు హిమాలయాలకు పోదలచి, తల్లివద్ద సెలవు కోరినప్పుడు, ఆమె కుమా వానిని దీవించి 'నాయనా!—నీవు ధర్మ మూర్తివి. పవిత్రజీవనం గడిపి తరించు,' అని చెప్పి పంపింది

సుమనసుడు హిమాలయ ప్రాంతం చేరుకుని, అక్కడ విశ్వకర్మ నిర్మించి వుంచిన దివ్యకుటీరంలో కాలక్షేపం చేశాడు.

రేణుకుడు తన తప్పు తెలుసుకొని, కపటయోగికి మరణదండన విధించాడు. నాటినుంచీ యోగులకు రాజ్యంలో ఎవరూ ఆశ్రయం ఇవ్వవద్దని శాసనం చేశాడు

ఈ విధంగా, దుష్టబుద్ధి ఐన ఒక్క కపటయోగివల్ల కురురాజ్యంలో యోగి బృందానికంతటికీ తీరని అపకీర్తి కలిగి, ప్రజాదరణ లేకుండాపోయింది.






ఒకరోజు భోజరాజు అస్థానానికి నలుగురు కన్యలు వచ్చారు. వారు చిన్నతనంలోనే కాశీకి వెళ్లి అక్కడ సమస్తవిద్యలూ సంపాదించుకుని, యుక్తవయసు రావటంవల్ల, వివాహాలు చేసుకునేటందుకు ఇళ్ళకు పోతూ ఇక్కడ ఆగారు.

వారు నలుగురూ సభలో అడుగుపెట్టగానే సభలోనివారంతా వారి అందం చూసి నిర్ఘాంతపోయారు. వారిని చూసి రాజు:

"అమ్మా, మీరే కులంవారు? ఎక్కడి నుంచి వస్తున్నారు? ఇక్కడికి ఏ పనిమీద వచ్చారు?" అని అడిగాడు.

"రాజా, మేము కాశీలో పాండిత్యం సంపాదించి, మమ్మల్ని మించిన పండితు లెక్కడైనా ఉన్నారా అని విచారిస్తూ ఇక్కడికి వచ్చాం. వేషభాషలలో మేము నలుగురమూ ఒకటిగానే కనిపించినా, నిజానికి మేము నాలుగు కులాలవాళ్ళం. అయితే, దిగ్గంతులవంటి పండితులు గల మీకు మా కులాలు కనిపెట్టటం ఏమంత కష్టమైన పని?" అన్నారు కన్యలు.

వారి కులాలు తెలుసుకోవటం భోజరాజుకూ, ఆయన కొలువులో వున్న పండితులకూ సవాలయింది. సాభిప్రాయంగా భోజరాజు పండితులకేసి చూశాడు. వారందరి ముఖాలూ వెలవెలపోయాయి.

"మీరు మా ఆతిథ్యం స్వీకరిస్తూ ఇక్కడ మూడు రోజులున్నట్టయితే ఈ లోపుగా మా పండితులు మీ మీ కులాలు తెలుసుకుంటారు," అన్నాడు భోజరాజు ఆ నలుగురు కన్యలతో.

వారు చిరునవ్వులు నవ్వి, సరేనన్నారు. వారు నిత్యమూ సభకు వచ్చి పోతున్నారు. పండితచర్చలలో పాల్గొంటున్నారు. కాని అస్థానంలో పండితులకు వారి కులాల జాడ ఏమాత్రమూ తెలియలేదు. వారి దుస్తులలో

పి. రామశర్మ

సామ్యం ఉన్నట్టే మిగిలిన అన్ని విషయాల లోనూ సామ్యం కనిపించింది. వారి మాటలలోగాని, యాసలోగాని, తెలివితేటలలో గాని, మనస్తత్వంలోగాని వారి కుల లక్షణాలు ఏమాత్రమూ పొడకట్టక పోవటం చూసి భోజరాజు ఆస్థాన పండితులు దిగ్భ్రమ చెందారు.

రెండు రోజులు గడిచాయి. ఇంకొక్క రోజు గడువున్నది.

రెండో రోజు రాత్రి కాళిదాసు, మీద కంబలీ కప్పుకుని, నలుగురు కన్యల విడిది బయట అరుగుమీద పడుకున్నాడు. తెల్లవారి లేచి వారు తమలో తాము మాట్లాడుకునేటప్పుడు వారివారి కులతత్వాలు బయటపడతాయని కాళిదాసు నమ్మకం.

మూడో రోజు తెల్లవారింది. నలుగురు కన్యలూ లేచారు. కిటికీవద్దకు వచ్చి తూర్పుదిక్కున అరుణోదయం చూశారు. వారిలో ఒకామె ఈవిధంగా అన్నది :

అభూ త్ప్రాచీ పింగా రసపతి రివ ప్రాశ్య కనకం

(తూర్పుదిక్కు బంగారం కరిగించిన పాదరసంలాగా పచ్చబడింది.)

ఇంకోకన్య ఇలా అన్నది :

గతచ్ఛాయ శ్చంద్రో బుధజన ఇవ గ్రామ్యసదసి

(మూర్ఖుల సభలో పండితునిలాగా చంద్రుడు వెలవెలబోతున్నాడు.)



మరొక కన్య ఇలా అన్నది:

క్షణాత్ క్షీణా స్తారా నృపతయ ఇవా నుద్యమపరాః

(ఉద్యమ విముఖులైన రాజులవలె నక్ష త్రాలు అంతలో క్షీణించాయి.)

నాలుగోకన్య ఇలా అన్నది:

న రాజన్తే దీపా ద్రవిణరహితానా మివ గృహాః

(దరిద్రుల ఇళ్లలాగా దీపాలు కాంతి విహీనంగా ఉన్నాయి.)

ఈ మాటలు వినగానే కాళిదాసు వచ్చిన కార్యం సఫలమయింది. ఆయన తక్షణం బయలుదేరి ఇంటికి వెళ్ళాడు.

అనాటి సభ ఆరంభంకాగానే భోజరాజు పండితులతో, "ఈ విద్వత్కన్యలు మూడు రోజులుగా మన ఆస్థానంలో వున్నారు. వీరి కులాలేవో తెలుసుకునే భారం మీ అందరి పైనా వున్నది. మీలో ఎవరైనా చెప్పగలిగితే వారి కులాలు చెప్పండి. లేనిపక్షాన వారికి ఓడినట్టు మీరు అంగీకరించవలిసి వుంటుంది," అన్నాడు.

పండితులందరూ తలలు వంచారు. ఒక్క కాళిదాసు మాత్రం లేచి ఈవిధంగా శ్లోకం చదివాడు:

అభూ త్ప్రాచీ పింగా రసపతి రివ ప్రాశ్య కనకం
గతచ్ఛాయ శ్చంద్రో బుధజన ఇవ గ్రామ్యసదసి
క్షణాత్ క్షీణా స్తారా నృపతయ ఇవా నుద్యమపరాః
న రాజన్తే దీపా ద్రవిణరహితానా మివ గృహాః

"మహారాజా, ఈశ్లోకం నాలుగుపాదాలూ నలుగురు కన్యలు చెప్పారు. ఇందులో మొదటిపాదం చెప్పిన కన్య కంసాలి కులానికి చెందినది. మిగిలిన పాదాలు చెప్పినవారు వరుసగా బ్రాహ్మణ, క్షత్రియ వైశ్యకన్యలు."

కాళిదాసు చెప్పిన ఈ మాటలు వినగానే విద్వత్కన్యలు ఆయనకు ప్రణామం చేసి, చెప్పినది నిజమేనని ఒప్పుకున్నారు.

ఆ కన్యల పాండిత్యానికీ, తమ కులాలు ఒకంతట తెలియరాకుండా దాచిఉంచిన వారి నేర్పరితనానికీ మెచ్చుకుని భోజుడు వారిని గొప్పగా సత్కరించి పంపాడు.





# కీర్తిసేన కథ

పాటలీపురంలో ఒక వైశ్యుడికి కీర్తిసేన అనే కుమార్తె ఉండేది. ఆ పిల్లను మగధలో వుండే దేవసేనుడనే గొప్ప ధనికుడి కిచ్చి పెళ్ళి చేశారు. దేవసేనుడికి తండ్రి లేడు. ఇంట తల్లిదే పెత్తనం. తన కొడుకు భార్యమీద అపేక్షగా వుండటం చూసి దేవసేనుడి తల్లి తన కోడలిని కనపడకుండా హింసలు పెట్టసాగింది. భర్త మనసు కష్టపడిపోతుందేమోనని కీర్తిసేన ఈ విషయం ఎన్నడూ అతనితో చెప్పలేదు.

ఇలా ఉండగా దేవసేనుడు వర్తకం కోసం వలభీనగరం వెళ్లవలసి వచ్చింది. అతను తిరిగి వచ్చేదాకా తనకు దిక్కు లేదు గనుక, కీర్తిసేన భర్తతో తన అత్తగారు పెడుతున్న హింసలు చెప్పుకున్నది.

దేవసేనుడు ఆశ్చర్యపోయాడు. అయినా భార్యను వెంట తీసుకుపోవటం సులభమైన పని కాదు గనక, అతను తల్లితో లౌక్యంగా, "అమ్మా, నేను వెళుతున్నాను. నీ కోడలు గొప్పయింట పుట్టినది. నేను తిరిగి వచ్చేదాకా దాన్ని ఎట్లా చూసుకుంటావో మరి!" అన్నాడు.

"నాకు తెలియదుట్రా, నాయనా? నాకు నువ్వొకటీ, అది ఒకటీనా?" అన్నది తల్లి. అనుమానం తీరినవాడై దేవసేనుడు ప్రయాణమై వెళ్ళాడు.

వెంటనే అత్తగారు కీర్తిసేనను చావ చితకగొట్టి, "పాపిష్టిదానా, నాకూ నా కొడుక్కూ మధ్య తంపులు పెడతావా? అనుభవించు," అంటూ, ఆమెను ఇంటి అడుగున వున్న చీకటికొట్లో వేసి, మూత మూసి గడియవేసింది. తన కోడలు అందులోనే మగ్గి చస్తే, కొడుకు వచ్చాక, "నాయనా, నీ భార్య నీకోసం బెంగపడి చచ్చింది!" అని చెప్పటానికి ఆమె నిశ్చయించుకున్నది.

ఎస్. సత్యనారాయణరావు




చీకటికొట్లో కీర్తిసేన చాలాసేపు తన దుస్థితి తలుచుకుని దుఃఖించింది. తనకు కొండంత తండ్రి వున్నాడు, ప్రాణం ఇచ్చే భర్త వున్నాడు, బోలెడంత ధనం వున్నది. కాని తన గతి ఇంత నీచంగా పరిణమించింది! ఆమె ఆ చీకట్లో తడివి చూడగా ఒకమూల తవ్వుగోల దొరికింది. ఆమె ఉత్సాహం తెచ్చుకుని దానితో సొరంగం తవ్వసాగింది. తవ్వగా తవ్వగా సొరంగం ఆమె పడకగదిలోకి వెళ్ళింది.

వెంటనే కీర్తిసేన దొరికినన్ని బట్టలూ, నగలూ పోగుచేసుకుని తెల్లవారేలోపుగా ఊరి బయట పడింది. ఈస్థితిలో తాను తండ్రి వగ్గిరికి పోవటం భర్తకు అవమానమవుతుందని ఆమెకు తోచింది. అందుచేత దారి కనుక్కుంటూ వలభికే వెళ్ళి తన భర్తను చేరుకుందా మనుకున్నది.

ఆమె ఒక చెరువులో స్నానంచేసి మగవేషం వేసుకున్నది. తనదగ్గిర వున్న బంగారంలో కొంత దారిఖర్చుకు అమ్మేసి బయలుదేరింది. దారిలో ఆమెకు సముద్రదత్తుడనే వర్తకుడు తటస్థపడ్డాడు. అయన కూడా వలభికే పోతున్నాడు.

ఈ సముద్రదత్తుడి వెంట చాలా బళ్ళ సామానున్నది. ఈ సామానంతా మామూలు దారిన తీసుకుపోతే ప్రతి నగరంలోనూ పన్ను చెల్లించవలిసి వస్తుందని, వర్తకుడు బళ్ళను అడవిదారి పట్టించాడు. అడవిలో కొంతదూరం పోయి ఒకచోట విడిది చేశారు.

మరికొంచెం సేపటికల్లా దూరాన నక్కల కూతలు వినిపించాయి. ఎవరో బందిపోటు దొంగలు వస్తున్నారని వర్తకుడి మనుషులు గ్రహించి, ఆయుధాలు తీసుకుని చుట్టూ నిలబడ్డారు.

దొంగలు వచ్చినట్టయితే తనకు ప్రాణహానే గాక, తాను ఆడదన్న సంగతి బయట పడితే మానహానికూడా కాగలదని కీర్తిసేన గ్రహించింది. ఆమె తన రక్షణభారాన్ని

వర్తకుడికి వదలక, చుట్టూ వెతికి ఆ అడవిలో ఒకచోట గుంట ఒకటి ఉండటం గమనించి, అందులో దూకి పైన దట్టంగా ఆకులు కప్పేసుకున్నది.

ఆ రాత్రి దొంగలదండు రానే వచ్చింది. దొంగలు వర్తకుడి మనుషులతో యుద్ధం చేసి, కొందరిని చంపి, సొత్తుయావత్తూ కొల్లగొట్టుకు పోయారు. వర్తకుడూ, చావగా మిగిలిన అతని మనుషులూ పారిపోయారు.

తెల్లవారగానే కీర్తిసేన తనను కాపాడిన గుంటలోనుంచి బయటికి వచ్చి, అడవి వెంబడి నడవసాగింది. అట్లా కొంతదూరం వెళ్ళేసరికి అక్కడ ఆమెకు అటవికుల గూడెం ఒకటి కనిపించింది. ఆ గూడెంలో ఆమెకు ఒక వింత దృశ్యం కంటబడింది.

ఒక అటవిక వైద్యుడు ఒక రోగిని తెచ్చి, అతని తలకు నెయ్యి మర్దించి ఎండలో కూచోబెట్టాడు. తరవాత ఒక నీళ్ల కుండ తెచ్చి, రోగి పక్కన పెట్టాడు. ఆ రోగి చెవి వాచి ఎర్రగా వున్నది. ఒక వెదురు గొట్టం తెచ్చి దాని ఒక చివర నీళ్ల కుండలోనూ, రెండో చివర జబ్బుగా వున్న మనిషి చెవికి ఆనించీ పెట్టాడు.

కీర్తిసేన చూస్తుండగానే జబ్బుగా వున్న చెవిరంగు మారింది. రోగి ముఖాన బాధా లక్షణాలు పోయాయి. వైద్యుడు నీళ్లకుండ





లోనుంచి పురుగులు కొన్ని తీసి చూపించాడు. రోగిచెవిలో చేరి వ్యాధి తెప్పించిన ఈ పురుగులు ఎండవేడికి తాళలేక గొట్టం కుండా చల్లని నీటికుండలోకి వచ్చేశాయి.

"ఇటువంటి పురుగులే పట్టి వసుదత్త మహారాజుగారిని పీడిస్తున్నాయి. వారు చావనన్నా చస్తారుగాని మనబోటివారిచేత వైద్యం చేయించుకోరుగా!" అన్నాడు ఆటవిక వైద్యుడు.

ఇదంతా చూసి ఆశ్చర్యపడుతూ కీర్తిసేన ముందుకు పోయింది. కొంతదూరం వెళ్ళాక ఆమెకు దారిపక్కన ఒక గొర్రెల కాపరి కనుపించాడు.

"వసుదత్త మహారాజు గారుండేది ఎక్కడ?" అని ఆమె వాణ్ణి అడిగింది.

"అదుగో, ఆ కనిపించేదే వసుదత్తపురం. ఈ అడివంతా ఆ మహారాజుదే," అన్నాడు గొర్రెలకాపరి.

కీర్తిసేనకు ఇంకొక ఆశ పుట్టింది. సామాన్యంగా వర్తకులంతా ఈ దారినే వస్తారని సముద్రదత్తు డన్నాడు. తన భర్తకూడా ఈ దారినే రావచ్చు. తాను వసుదత్తపురం చేరినట్టయితే అక్కడే తన భర్తను కలుసుకోవచ్చు. ఆటవిక వైద్యుడు చెప్పిన మాట నిజమైతే తాను రాజుకు చికిత్స కూడా చెయ్యవచ్చు. రాజుగారి ఆదరం సంపాదించుకుంటే ఆయన తన భర్తను క్షేమంగా అడవి దాటించగలడు.

ఈవిధంగా ఆలోచిస్తూ కీర్తిసేన వసుదత్తపురం చేరి రాజభవనానికి వెళ్ళింది. అప్పటికే వసుదత్త మహారాజు చావుబతుకుల మధ్య ఉన్నాడు. నగరంలో వైద్యులందరూ ఎన్నో రకాల వైద్యాలు చేసి చూసి, లాభంలేక వదిలిపెట్టేశారు.

మగవేషంలో వున్న కీర్తిసేన రాజుగారికి చికిత్స చేస్తాననేసరికి అందరికీ కొత్త ఆశ కలిగింది. ఆమె రాజుకు చికిత్స చేసింది. నీళ్ళకుండలో రాజుగారి చెవి

నుండి నూటయాభై పురుగులు పడాయి. రాజుగారికి బాధంతా పోవటమే గాక, ప్రాణం తిరిగివచ్చినట్టయింది. ఆయన పాలూ, నెయ్యీ సేవిస్తూ త్వరత్వరగా బలం చేకూర్చుకోసాగాడు.

రాజుగారికి ప్రాణభిక్ష పెట్టిన కీర్తిసేనను పొగడనివారు లేరు. రాజుగారే గాక రాజ్యంలో ఉన్న ధనికులూ, పేదలూ సయితం, ఆమెకు అంతులేని కానుకలు సమర్పించారు. ఈ కానుకలన్నిటినీ ఆమె భద్రంగా తనవద్ద దాచిఉంచింది.

ఆమె అనుకున్నట్టే దేవసేనుడు తిరుగు ప్రయాణంలో వసుదత్తపురం చేరాడు. నగరంలోకి కొత్తబిడారు వచ్చిందంటే అందరికీ తెలుస్తుంది. ధనికులు వెళ్ళి తమకు కావలిసిన వస్తువులు కొనుక్కుంటారు. వర్తకులు తమదగ్గిర ఉండే సరుకు అమ్ముతారు. అనేకవేలమంది ఊరికే చూడబోతారు.

రాజుగారు వసుదత్తుడి బిడారు చూడబోతూ కీర్తిసేననుకూడా తనవెంట తీసుకుపోయారు. ఆమె పురుషవేషంలో ఉన్నప్పటికీ దేవసేనుడు ఆమె కళ్ళు చూస్తూనే తన భార్య అని పోల్చుకున్నాడు.

ఆ తరవాత ఆమె పురుషవేషంలో ఉండటం అనవసరమయింది. అన్ని



కష్టాలూ తీరి, కీర్తిసేన తన భర్తను తిరిగి కలుసుకున్నది. వసుదత్త మహారాజుకూడా చాలా సంతోషించాడు.

రాజుగారు దేవసేనుణ్ణీ, కీర్తిసేననూ తన భవనానికి తీసుకుపోయి గొప్పగా విందుచేశాడు.

కీర్తిసేన తను యింతకాలంగా అనుభవించిన కష్టాలనుగురించి రాజుగారికీ, తన భర్తకూ చెప్పేసింది.

సరిగా చూస్తానని తనకు మాట ఇచ్చి కూడా తన భార్యకు ఇన్ని కష్టాలు తెచ్చి పెట్టిన తన తల్లిమీద దేవసేనుడికి పట్టరాని ఆగ్రహం కలిగింది. రాజుగారికి మటుకు కీర్తిసేన ధైర్యసాహసాలు చూసి చాలా ముచ్చటయింది.

"మీరు నా కూతురూ, అల్లుడులాటి వారు. మిమ్మల్ని నేను పోనిచ్చేదిలేదు. అమ్మాయి నాతరవాత సింహాసనం ఎక్కుతుంది. నువు ఈ ఊళ్ళోనే వుండి వర్తకం చూసుకో. దీని కెవరూ ఎదురుచెప్పటానికి వీల్లేదు. అంతే!" అన్నాడు రాజు.

దేవసేనుడు ఇంత జరిగాక తల్లి ముఖం చూడలేకపోయాడు. కీర్తిసేన ఎంతచెప్పినా తల్లిని తీసుకురావడానికి నిరాకరించాడు.

ఒకరోజు కీర్తిసేన, తనకు రాజూ, ఇతరులూ ఇచ్చిన బహుమానాలన్నీ బళ్ళమీద వేయించుకుని అడివిదారిన భర్తతో ప్రయాణమయింది. ఆమె ఆటవికుల గూడెం చేరి వైద్యుణ్ణి పిలిపించి:

"రాజుగారి జబ్బు కుదిర్చినందుకు నీకీ బహుమతులు వారు పంపించారు!" అని తానుతెచ్చిన బహుమాన వస్తువులతో వున్న బళ్ళను అతనికిచ్చేసింది.

ఆటవిక వైద్యుడు తను ఎప్పుడు, ఏ విధంగా వసుదత్త మహారాజుగారి జబ్బు కుదర్చానా అని ఆశ్చర్యపడుతూ, తిరిగి వెళ్ళిపోయే కీర్తిసేనా దేవసేనుల వంక నోరు తెరుచుకు చూస్తూ నిలబడ్డాడు.





# వేపచెట్టు మహిమ

పూర్వం మళయాళదేశంలో ఒక జామొరిన్ ధనాశచేత తన రాజ్యమంతటా చింతచెట్లు నాటించటానికీ, చింతతోపులు వేయించటానికి నిశ్చయించి, ఆ పనికి తన మంత్రిని నియోగించాడు.

ఆ రాజ్యంలో నంబియారనే గొప్ప వైద్యుడుండేవాడు. మూలికావైద్యంలో నంబియారుకు యావద్భారతఖ్యాతి ఉండేది. ఆ కాలంలో ఢిల్లీపాదుషాదగ్గిర వుండే అరబ్బీ హకీమ్ ప్రకృతివైద్యంలో అద్భుత ప్రజ్ఞ గలవాడు. నంబియారుకూడా దాదాపు ఆయనతో సమానమైన వైద్యుడని ప్రజలు చెప్పుకునేవారు.

జామొరిన్ దేశమంతటా చింతచెట్లు నాటిస్తున్నాడని తెలియగానే నంబియారు ఆయన దగ్గిరికి వెళ్ళి, "చింతచెట్లు అనారోగ్యకరమైనవి. వాటి బదులు వేపచెట్లు వేయించండి. ప్రజలు ఆరోగ్యవంతులుగా ఉంటారు. అంటువ్యాధులు చేరవు," అన్నాడు. జామొరిన్ వినిపించుకోలేదు.

"చింతచెట్లవల్ల అనేక ఉపయోగాలున్నాయి. చింతపండుకు మంచి గిరాకీ వున్నది. చింతకట్టెతో చేసిన బొగ్గులు శ్రేష్ఠమైనవి. చింతపుల్లలతో పళ్ళు తోముకోవచ్చు. చింతచిగురూ, చింతపూవూ ఎంతో రుచిగా వుంటాయి. దారులవెంబడి చింతమొక్కలు నాటి విడిచినట్టయితే, ఎవరూ పోషణ చేయకుండానే అవి బ్రహ్మాండమైన చెట్లుగా పెరిగి ప్రయాణీకులకు చల్లని నీడనిస్తాయి. వేపచెట్లవల్ల ఒక్క ప్రయోజనమూ లేదు," అన్నాడు జామొరిన్.

నంబియారు ప్రభువుకు మారు చెప్పలేక శలవు తీసుకుని నేరుగా మంత్రి ఇంటికి వెళ్ళాడు. మంత్రి ఆయనకు గౌరవంగా స్వాగతమిచ్చి కుశలప్రశ్నలు వేశాడు. నంబియారు మంత్రి ముఖంలో

సి. పద్మనాభం




ఏదో గమనించినవాడిలాగా నటిస్తూ, ఆయన కనురెప్పలకిందా, నోటిలోనూ చూసి, నాడి పరీక్షించసాగాడు.

మంత్రి నవ్వుతూ, "ఎందుకిలా పరీక్షిస్తున్నారు? మీదయవల్ల నా ఆరోగ్యానికి లోపమేమీ లేదు," అన్నాడు.

నంబియారు గంభీరంగా, "ఇప్పుడేమీ లోపం లేదు. కాని ఆరు మాసాలలో మీకు భయంకరమైన జబ్బు చేయబోతున్నది. సకాలంలో దానికి తగిన చికిత్స జరగటం మంచిది," అన్నాడు.

మంత్రి కంగారుపడి, "అయితే తక్షణం వైద్యం ప్రారంభించండి," అని అడిగాడు.

"ఈ వ్యాధి నా వైద్యానికి లొంగేది కాదు. మీరు వెంటనే బయలుదేరి ఢిల్లీలో పాదుషాగారివద్ద ఉండే హకీమ్‌ను చూడటం మంచిది," అన్నాడు నంబియారు.

"అంతదూరం ఏదోవిధంగా కష్టపడి వెళ్ళితే మాత్రం ఆయన నన్ను సరిగా చూస్తారా?" అన్నాడు మంత్రి.

"హకీమ్‌గారికి అటువంటి తేడాలేమీ లేవు. ఆయన కడు బీదవారికికూడా ఆదరంతో చికిత్స చేస్తాడు. మీరు వెంటనే బయలుదేరటం అన్నివిధాలా మంచిది," అన్నాడు నంబియారు.

వ్యాధివిషయం నంబియారు చెప్పిన దానికి తిరుగులేదు గనక మంత్రి ఒక సంవత్సరం శలవుతీసుకుని ఢిల్లీకి ప్రయాణం కట్టాడు. ఆయన బయలుదేరేటప్పుడు నంబియారు ఒక సలహా ఇచ్చాడు:

"దారిలో చింతచెట్ల నీడనే విశ్రమించండి. చింతలతోపుల్లోనే మకాంచెయ్యండి. చింతపుల్లలతోనే ముఖం కడుక్కోండి. మీ వంట వగైరాలు చింతకట్టెలతోనే చేయించుకోండి."

మంత్రి నంబియారు యిచ్చిన సలహాను అక్షరాలా పాటిస్తూ సపరివారంగా ఢిల్లీకి ప్రయాణమయాడు. ఇంకా ఢిల్లీ చేరక

మునుపే ఆయన ఆరోగ్యం చెడ నారంభిం చింది. బలహీనత ఏర్పడింది. శరీరం చిక్కి పాలిపోసాగింది.

"ఆహా! నంబియా రెంత తెలివిగల వైద్యుడు! ఈనాడు వచ్చిన రోగాన్ని ఆయన ఆనాడే పట్టగలిగారు." అనుకుంటూ మంత్రి అతి బలహీన స్థితిలో ఢిల్లీ చేరాడు.

ఆయనకు హకీమ్‌గారి దర్శనం చాలా సులువుగా లభించింది. మంత్రి చెప్పిన దంతా విని, నంబియార్ ఈ మంత్రిని, చింత చెట్లవల్ల కలిగే అపాయం ఎలాంటిదో రుజువుచేయటానికే తనవద్దకు పంపివుంటా డని హకీమ్ ఊహించాడు.

"మీ వ్యాధి గొప్పదేగాని దాని చికిత్స చాలా సులువైనది." అన్నాడు హకీమ్

"అదేదో చెప్పండి. మీకు యావజ్జీవం ఋణపడివుంటాను," అన్నాడు మంత్రి.

"మీరు వెంటనే బయలుదేరి మీ దేశా నికి వెళ్ళిపొండి. వెళ్ళేటప్పుడు వేపచెట్ల నీడలోనే విశ్రమించండి. వేపతోపులలోనే మకాంచెయ్యండి. గాలి చాలనప్పుడు వేప మండలతో విసురుకోండి. వేపచెట్ల గాలి తగిలే చోట నిద్రపొండి. వేపపుల్లతోనే ముఖం కడుక్కోండి. ఇంతకంటె మీ వ్యాధికి మరొక చికిత్స అవసరం లేదు. నంబియారుగారికి నా తరఫున వెయ్యి సలా



ములు చెప్పండి. వెళ్ళిరండి,'' అన్నాడు హకీమ్, మంత్రితో.

ఇదే సలహా మరొక వైద్యుడెవడైనా ఇచ్చి ఉంటే మంత్రికి గురి ఉండకపోను. హకీమ్ చెప్పాడు గనక పూర్తిగా విశ్వసించి, మంత్రి సపరివారంగా స్వదేశానికి ప్రయాణమయాడు. హకీమ్ చెప్పినప్రకారమే ఆయన వేపచెట్ల నీడల విశ్రమిస్తూ, వేపచెట్ల గాలి అనుభవిస్తూ దారిలోనే తన ఆరోగ్యాన్ని తిరిగి సంపాదించగలిగాడు. స్వదేశానికి చేరే సరికి పూర్వంకన్న రెట్టింపు బలమూ, ముఖకళా ఆయనలో కనబడింది.

మంత్రి ఇల్లు చేరగానే నంబియారు ఆయనను చూడవచ్చాడు. మంత్రి తన అనుభవాలన్నీ నంబియారుకు చెప్పాడు.

"మనం ఒకసారి జామొరిన్‌గారివద్దకు వెళదాం. మీ అనుభవాలనుగురించి ఆయన స్వయంగా వినటం చాలా ముఖ్యం!" అన్నాడు నంబియారు.

ఇద్దరూ కలిసి జామొరిన్‌దగ్గిరికి వెళ్లారు. జామొరిన్ మంత్రి అనుభవాలు విని చాలా ఆశ్చర్యపోయాడు.

"ఇందులో నా తప్పు చాలా ఉన్నందుకు మీరిద్దరూ నన్ను మన్నించాలి. మంత్రి గారికి ఏ జబ్బూ లేకుండానే నే నాయనను ఢిల్లీ ప్రయాణం గట్టించాను. చింతచెట్ల వల్ల కలిగే హాని ఏలినవారికి నిరూపించటమే నా ఉద్దేశం. ఆతరవాత వేపచెట్ల మహిమను హకీమ్‌గారు నేను చెప్పకుండానే నిరూపించారు. ఇప్పటికైనా ప్రజల మేలు కోరి మీరు చింతచెట్లు నాటించటం మాని వేపచెట్లు నాటించండి. అవకాశంవున్న ప్రతి చోటా వేపతోపులు వేయించటం మంచిది," అన్నాడు నంబియారు.

జామొరిన్ మారుమాట చెప్పకుండా, తన రాజ్యమంతటా వీలయినన్ని వేపచెట్లు నాటించి వనమహోత్సవం జరిపించవలసిందిగా ఉత్తరువుచేశాడు.




మకర దేవత
సీరియల్ కథ—జూలై సంచికనుంచి ప్రారంభమవుతుంది.

# తాబేలు పన్నాగం—(అట్టచివరిబొమ్మ)

వింధ్యారణ్య ప్రాంతాలలో పూర్వం, ఒక పెద్దపులి ఉండేది. అది ఆకలయినప్పుడూ కానప్పుడూగూడా నిష్కారణంగా జంతువులను చంపుతూ వచ్చింది. దాని క్రౌర్యం భరించలేక మృగాలన్నీ ఒకనాడు సమావేశమై, పులి పీడ వదుల్చుకోవడం ఎలాగా అని చర్చలు సాగించినై. కాని, ఎంతకూ ఏమీ తేలలేదు.

అంతలో—అక్కడనే మడుగులో నివసించే ఒక తాబేలు సమావేశానికి వచ్చి, 'ఈ పులిసంగతి నాకు వదలండి, దాని అంతు నేను కనుక్కుంటాను! మీరు నిర్భయంగా వుండండి,' అని చెప్పింది.

మరునాడు, పులి నీటికై కొలనుకు వచ్చేవేళకు సరీగా తాబేలు గట్టుమీద అటుయిటు తచ్చాడుతూవుంది. దాన్ని పట్టుకోవాలని పులి వచ్చేసరికి అది తలకాయ లోపలికి ముడిచేసుకుంది. పెద్దపులి ఎంత ప్రయత్నించినా తాబేటి డిప్ప దాని పంజాల్లో జారుతూవుందేకాని, పట్టు దొరకలేదు, తల కనబడలేదు.

ఇంతకు ముందెన్నడూ తాబేలును చూసివుండని పులికి ఇదంతా ఒక మహిమగా కనిపించింది. అప్పుడు పెద్దపులి ఆ తాబేటి డిప్పకు నమస్కరించి, "మహాత్మా!—నీవెవరవో సామాన్యుడవు కావు! ఇప్పుడే నే కళ్ళారా చూచిన నీతల మాయమైపోయిందే! ఈ అద్భుతమేమిటో సెలవిస్తారా?" అని అడిగింది.

అందుకు తాబేలు, "ఓ శార్దూలరాజా!—లయకారకుడవని బిరుదు పొందిన నీకు ఈ చిన్ని కీలకమే తెలియదా? నేను ముందుగా నా తలను తెగ్గొట్టుకుని, మెడతిత్తిలో అమర్చుకున్నాను. ఈ యేర్పాటువల్లనే నేను కావలిసినప్పుడు మెడ ముందుకు చాపగలను, శత్రుభయం కలిగినప్పుడు లోపలకు ముడిచేసుకోగలను. నువ్వూ శత్రుభయం లేకుండా బ్రతకదలిస్తే నాలాగనే మెడ తెగ్గొట్టి తెచ్చుకో. తరవాత సంగతి చెబుతా" అన్నది.

యోచన లేని పులి వెంటనే తన గుహకు పోయి వేటగాండ్రవద్దనుండి తెచ్చుకున్న కత్తిని ఒక చెట్టుకు అమర్చింది. ఎత్తయిన గుట్టమీదికి పోయి, మెడ కత్తిమీద పడేట్టు విసురుతో కిందికి దూకింది. దెబ్బతో దాని మెడ, మొండెమూ వేరైనాయి. పక్కనే కొలనుగట్టున వున్న తాబేలు చిరునవ్వుతో, 'ఓయీ వ్యాఘ్రరాజా!—ఇంకిప్పుడు నీ తలను తీసి మెడతిత్తికి అమర్చుకో!' అన్నది. కాని, బదులు చెప్పటానికి పులి బతికివుంటే కద! ★

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

**1955 ఆగస్టు సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు**





★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.

★ జూన్ 10-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/-లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26.

---

## జూన్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: క్షణం తీరిక లేదు | రెండవ ఫోటో: తృణం రాబడి లేదు

పంపినవారు: బోయిన వేణుగోపాలరావు, IV ఫారం B,

బోర్డు హైస్కూలు, బంటుమిల్లి, బందరు తా॥ (కృష్ణాజిల్లా)

**బహుమతిమొత్తం రు 10/- ఈ నెలాఖరులోగా పంపబడుతుంది**



# వార్తలు-విశేషాలు

కృష్ణానదిపై నిర్మించే నాగార్జునసాగర్ డాం వల్ల 34 లక్షల ఎకరాలకు పైగా భూమి సాగులోకి వస్తుంది. గుంటూరు జిల్లాలోని మాచర్లకు 13 మైళ్ళ దూరంలో నందికొండ గ్రామంవద్ద యీ డాం నిర్మించబడుతుంది. నిర్మాణానికి అయ్యే ఖర్చు 122.02 కోట్ల రూపాయలని అంచనా వేశారు.

*　　*　　*　　*

ఇండోనేషియాలోని బాండుంగ్‌నగరంలో ఆసియా—ఆఫ్రికాదేశాల మహాసభ జరిగింది. ఈ మహాసభకు 29 దేశాలనుంచి ప్రతినిధులు వచ్చారు. అణ్వాయుధాలను నిషేధించాలనీ, వలసరాజ్యవిధానం అంతరించాలనీ మహాసభ తీర్మానించింది. మన ప్రధాని పండిట్ నెహ్రూ యీ సమావేశాల విజయానికి ఎంతగానో తోడ్పడ్డారు.

*　　*　　*　　*

ఆంధ్రరాష్ట్ర వ్యవసాయ శాఖామంత్రి శ్రీ నీరుకొండ రామారావుగారు హృద్రోగంవల్ల మే 4వ తేదీన మద్రాసు జనరల్ హాస్పిటల్లో మరణించారు. వీరి వయసు 41 సంవత్సరాలు. గత అసెంబ్లీ ఎన్నికలలో తూర్పుగోదావరిజిల్లాలోని బూరుగుపూడి నియోజకవర్గంనుంచి కాంగ్రెసు అభ్యర్థిగా ఎన్నిక అయినారు.

*　　*　　*　　*

మొదటి పంచవర్ష ప్రణాళిక పూర్తి అయేసరికి 6500 గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరా అవుతుందని ప్రభుత్వంవారి అంచనా.



ఈ నెలలో చందమామ కార్యాలయానికి తెనాలినుండి హైస్కూలు విద్యార్థులు వచ్చి, పత్రికల నిర్వహణ పరిశీలించారు. బొంబాయిలో శ్రీ సి. డి. మర్చంట్ యాజమాన్యాన నిర్వహింపబడే 'చిల్డ్రన్స్ క్లబ్'కు చెందిన 120 మంది బాలబాలికలుకూడ మే 17-వ తేదీన చందమామ ఆఫీసుకు వచ్చి, ఆ యా శాఖలన్నీ ఎలా పనిచేసేదీ చూచి ఆనందించారు. వారికి చందమామ ఆఫీసులో విందు జరిగింది.

*    *    *    *

మే 10-వ తేదీన బరంపురంలో మాటాడుతూ ప్రధాని నెహ్రూ 'ఈనాడు ఇండియాకు కావలసిన ప్రధాన అవసరాలు మూడు :—విద్య, ఆరోగ్యం, ఉత్పత్తికి దోహదమిచ్చే కార్యకలాపాలు. ఇవి తీర్చటానికే ద్వితీయ పంచవర్ష ప్రణాళిక ఉద్దేశించబడింది' అని అన్నారు.

*    *    *    *

ఈజిప్టు గ్రామసీమలలో జీవనప్రమాణం హెచ్చించడంకోసం చరఖా ప్రచారంచేస్తామని ఈజిప్టు ఉపమంత్రి మిస్టర్ మహమ్మద్ అజూనస్సీర్ ప్రకటించాడు. ఆయన ఇండియానుండి తిరిగి వెళ్ళేటప్పుడు ఒక చరఖాను వెంట తీసుకువెళ్ళాడు.

*    *    *    *

'గోర' అనే చిక్కుడుజాతి మొక్కను ఇండియానుంచి తీసుకువెళ్ళి అమెరికా నైరుతి ప్రాంతంలోని టెక్సాస్‌లో పెంచుతున్నారు. అక్కడ ఈ మొక్కల పెరుగుదలను గురించి గత 3 సంవత్సరాలుగా పరిశోధనలు జరిగినై. ఈ మొక్కల గింజలు పశుగ్రాసంగా వాడబడుతున్నవి. వీటినుండి తీయబడే జిగురు పరిశ్రమలకు వినియోగపడుతున్నది.

*    *    *    *

జగద్విఖ్యాత శాస్త్రవేత్త, గణిత నిపుణుడూ అయిన ఆల్బర్ట్ ఐన్‌స్టయిన్, ఇటీవల అమెరికాలో మరణించాడు. ఈయన సాపేక్ష సిద్ధాంతాన్ని కనిపెట్టాడు. అణుశక్తిని వెలువరించటానికి ఆయనకృషి చాలా తోడ్పడింది. అణుశక్తిద్వారా మానవ నాశనం చెయ్యటం తప్పని చెప్పిన ప్రముఖులలో ఈయన ఒకడు. ఈయన మెదడులోని ప్రత్యేకతను శాస్త్రజ్ఞులు పరిశోధిస్తున్నారు.





# గ్రహాలు: బుధుడు

సూర్యుడిచుట్టూ తిరిగే గ్రహాలలో సూర్యుడికి చాలా దగ్గిర ఉండే గ్రహం బుధుడు; సూర్యుడినుంచి దీనిదూరం 3 కోట్ల మైళ్ళకుపైగా ఉంటుంది.

పరిమాణంలో బుధగ్రహం మన చంద్రుడికంటె కొద్దిగా పెద్దది; దీని అడ్డకొలత 2765 మైళ్ళు, చంద్రుడి అడ్డకొలత 2163 మైళ్ళు.

బుధుడికీ భూమికీ మధ్య ఉండే దూరం మారుతూ ఉంటుంది. అది మనకు 4 కోట్ల 80 లక్షల మైళ్ళ దూరంలోకి వచ్చి 13 కోట్ల 79 లక్షల మైళ్ళదూరానికి పోతూంటుంది.

ఆకాశంలో తిరిగే గోళాలన్నిటికీ ఇతర గోళాలను ఆకర్షించే శక్తి ఉన్నది. భూమికి గల ఆకర్షణశక్తి 100 అయితే, బుధుడి శక్తి 38 మాత్రమే. (సూర్యుడి శక్తి 2,770!)

బుధగ్రహం భూమికన్న సూర్యుడికి దగ్గిరిగా ఉన్నందువల్ల దానిమీదపడే సూర్యరశ్మి, వేడికూడా భూమిమీద పడేదానికి దాదాపు 7 రెట్లుంటుంది. అంటే బుధగ్రహంమీద వేడి ఎంతగా వుంటుందో మనం ఊహించవచ్చు.

దీనికి తోడు మరొక చిత్రంకూడా జరుగుతున్నట్టు కనిపిస్తుంది. అదేమిటంటే బుధగ్రహం ఒక్కసారి సూర్యుణ్ణి చుట్టి వచ్చేసరికి ఒక్కసారి తన చుట్టూ తాను తిరుగుతుందట. అంటే, బుధగ్రహంలో ఒక సగమే ఎప్పుడూ సూర్యుణ్ణి చూస్తూ ఉంటుంది. రెండో సగం మీద ఎన్నడూ సూర్యకాంతి పడదు. ఇదే నిజమైతే సూర్యుడి కేసి తిరిగిఉండే ప్రాంతం కాలి, బొగ్గయి, వేడిరాతి గుట్టమయంగా వుండాలి. ఎల్లప్పుడూ అంధకారంలో ఉండేభాగం ఎలా ఉంటుందో ఎవరూ ఊహించలేరు.

బుధగ్రహం సూర్యుడి చుట్టూ తిరిగే వలయం కోడిగుడ్డు ఆకారంలో వుండి, మాటి మాటికీ మారుతూ ఉంటుంది. ఈ వలయంలో బుధుడు సెకండుకు 29 మైళ్ళ వేగాన, రోజుకు 25 లక్షల 5 వేల మైళ్ళచొప్పున ప్రయాణం చేస్తాడు. ఒకసారి సూర్యుడి చుట్టూ తిరిగిరావటానికి బుధుడికి 87 రోజుల 23 గంటల 15 నిమిషాలు పడుతుంది. అంటే అది బుధుడి సంవత్సరమన్నమాట.

బుధుడు భూమికన్న చాలా తేలికైన గ్రహం. దాని ఘనపరిమాణం భూమిలో పదిహేడోవంతు, బరువు భూమిలో 22 వ వంతు, వైశాల్యం 7 వ వంతు.

Printed by B. NAGI REDDI at the B. N. K. Press Ltd., Madras 26, and Published by him for Chandamama Publications, Madras 26. Controlling Editor: SRI 'CHAKRAPANI'

Photo by P. B. Khata



బహుమతి
పొందిన వ్యాఖ్య

తృణం రాబడి లేదు

పంపినవారి పేరు:
బి. వి. రావు - బంటుమిల్లి

